## ఇందులో


* స్టాలిన్ సిద్ధాంతరీత్యా మన వ్యూహం - ఎత్తుగడలు
* వార్గా అభిప్రాయాలపై విమర్శ
* సామ్రాజ్యవాదాన్ని గురించిన రచనలలో సంస్కరణ పోకడలు — వార్గా
* బ్రిటిష్ డొమినియన్‌లలోని లేబరు పార్టీల అభివృద్ధి నిరోధక పాలసీ



22

1-9-49


# జనత

మార్క్సిస్టు సిద్ధాంత పక్షపత్రిక

| | | |
|---|---|---|
| సంచిక 22 | 1—9—1949 | వెల : 8 అణాలు |

## స్టాలిన్ సిద్ధాంతరీత్యా

# మనవ్యూహం: ఎత్తుగడలు



ఒక ప్రత్యేక విప్లవ దశలో ఆ దశ మొత్తానికి సంబంధించి నిర్ణయింపబడిన వ్యూహాన్ని కమ్యూనిస్టుపార్టీలో ప్రత్యక్షంగాగానీ, పరోక్షంగాగానీ మాటిమాటికి సవాల్ చేయడం జరగదు. మొత్తం దశకంతటికి సంబంధించిన దృక్పథం (అండర్ స్టేండింగ్) లోనే లోపం ఉన్నది అని పార్టీ భావించినప్పుడూ, వర్గసంబంధాలను తప్పుగా అర్థం జేసుకోడం జరిగింది అనుకున్నప్పుడూ, అందువల్ల పార్టీ దృక్పథాన్ని తప్పకుండా మార్చవలసి ఉన్నప్పుడూ, లేక పాతవర్గ సంబంధాలు అసంబద్ధంగా తయారైనప్పుడూ, లేక ఏ విప్లవదశకు ఆ దృక్పథం సంబంధించి ఉందో ఆదశ గడచిపోయినప్పుడూ—ఇలాంటి పరిస్థితుల్లో మాత్రమే వ్యూహం మారుతుంది – వ్యూహాన్ని మార్చి వేయడం జరుగుతుంది ఆనాడున్న వర్గ సంబంధాలపైనా, వివిధవర్గాలు నిర్వహించే పాత్రపైనా విప్లవదశనూ ఆ దశకు సంబంధించిన వ్యూహాన్ని అర్థంచేసుకోడం – నిర్ణయించడం – జరుగుతుంది. కాబట్టి వ్యూహాన్ని మార్చివేయాలంటే ఆయా వర్గాలు నిర్వహించే పాత్రలు

మారాయి అనీ, పాత దశ గడచిపోయి కొత్తదశ వచ్చిందనీ ముందు రుజువు చేయవలసి ఉంటుంది. అంతేకాని అసలు మూలసూత్రాల జోలికి పోకుండా (ఉదాహరణకు ప్రపంచ సంక్షోభం, ఇండియాలో వర్గసంబంధాలు) ప్రధాన దృక్పథాన్నే మార్చివేయడానికి పరోక్షంగా, చాటుమాటుగా చేసే సవరణలు, సలహాలు, ప్రశ్నలు, సందేహాలు అనుమతించదగినవి కావు. ప్రపంచ సంక్షోభం ఉన్నదా? లేదా? మనం విప్లవదశలో ఉన్నామా లేదా? ఇది విప్లవ పురోగతికి సంబంధించిన దశ అవునా కాదా? విజయం సాధిస్తామా సాధించమా? అనే ప్రశ్నలు వేయడంలో ఎంత అర్థంఉందో, ప్రజావిజృంభణ (అప్‌సర్జ్) ఉందా లేదా అనే ప్రశ్న వేయడంలో కూడా నిజంగా అంతే అర్థం ఉంది. ఇలాంటి ప్రశ్నను వేయడానికి ఎవరూ సాహసించరు. కాని అవకాశవాదం అసలు ప్రధాన సూత్రాలపై పోరాటం మానివేసి వాటిని సవరించడానికి దొడ్డిదారిన ప్రయత్నిస్తుంది.

ఈ అయోమయ పరిస్థితినుంచి – గందరగోళంనుంచి – బైట బడడానికి వ్యూహం, ప్రధాన నినాదాలు, ఎత్తుగడలు మొదలైన వాటిని గురించి లెనినిజం ఏమి బోధిస్తూఉందో ముందు స్పష్టంగా తెలియజేయవలసి ఉంటుంది. "లెనినిజం మూలసూత్రాలు" అనే తన పుస్తకంలో స్టాలిన్ "కార్మికుల వర్గపోరాటంలో నాయకత్వమునకు సంబంధించిన శాస్త్రమగు వ్యూహము, ఎత్తుగడల" పై (వ్యూహం; ఎత్తుగడలు, జాకోబిన్ పబ్లిషర్స్, తెనాలి : పేజి 1) ఇలా వ్రాశాడు : స్టాలిన్ సిద్ధాంతం ప్రకారం.

"విప్లవంయొక్క ఒకానొకదశలో శ్రామికవర్గం ప్రధానమగు దెబ్బను ఏదిక్కుగా కొట్టాలి అనే విషయాన్ని నిర్ధారణగావించడం; తదనుగుణంగా విప్లవశక్తులను (ప్రధానమగు, ద్వితీయమగు రిజర్వులను) మోహరించుటకై ప్లానును ఏర్పరచడం, విప్లవంయొక్క ఆదశ అంతటా ఆప్లానును అమలుజరుపుటకై పోరాడడం; ఇదేవ్యూహం."

(వ్యూహం : ఎత్తుగడలు, పేజీ 3—4.)

"విప్లవంయొక్క ప్రధానశక్తులకు, దాని రిజర్వులకు సంబంధించినది వ్యూహం. విప్లవం ఒకదశనుండి మరొకదశకు మారడంతో వ్యూహంకూడా మారుతుంది; కాని ఒకేదశలో ఆదశఅంతటా మాత్రం అది మారకుండానే ఉంటుంది.

(పైగ్రంథం ; పేజీ 6)

వివిధదశల్లో విప్లవవ్యూహాన్ని వివరిస్తూ స్టాలిన్ ఇలా వ్రాస్తు న్నాడు:

మన విప్లవం ఇప్పటికి రెండు దశలను గడిచినది; అక్టోబరు విప్లవం తర్వాత మూడవదశలో ప్రవేశించినది. మన వ్యూహంకూడా అందుకనుగుణ్యంగా మారినది.

ప్రధమ దశ: 1903 నుండి 1917 ఫిబ్రవరి వరకు: ఈ దశలో లక్ష్యం: జారు వ్యవస్థని కూలద్రోయటం, మధ్యయుగాలనాటి చిహ్నాలను పూర్తిగా తుడిచిపెట్టటం; విప్లవంయొక్క ప్రధానశక్తి: శ్రామికవర్గం. అందుబాటులోని రిజర్వు: ఇమిడియట్ రిజర్వు: రైతాంగం, ప్రధానమగు దెబ్బ కొట్టవలసిన దిక్కు: రైతాంగమును తమ వైపుకు ఆకర్షించటం, జారువ్యవస్థతో రాజీపడుటద్వారా విప్లవాన్ని అంతమొందించటం, వీటికొరకై ప్రయత్నిస్తున్న లిబరల్ - మొనార్కిస్టు బూర్జువావర్గాన్ని ప్రజల నుండి దూరంచేయటం. విప్లవశక్తులను మోహరించుటకై ప్లాను: శ్రామికవర్గం రైతాంగముయొక్క మిత్రత్వమును సంపాదించటం.

"నిరంకుశాధికారవర్గం ప్రతిఘటనను బలప్రయోగంతో అణచివేయుటకూ, బూర్జువావర్గంయొక్క అస్థిరత్వాన్ని స్తంభింపజేయుటకూ, రైతాంగ జనబాహుళ్యంతో కలిసి, శ్రామికవర్గం ప్రజాతంత్ర విప్లవాన్ని పూర్తిగావించాలి."

(సెలెక్టెడ్ వర్క్సు, వాల్యూం III పేజి 110)

రెండవదశ: 1917 ఫిబ్రవరినుండి 1917 అక్టోబరువరకు; లక్ష్యం: రష్యాలో సామ్రాజ్యవాదాన్ని కూలద్రోయటం: సామ్రాజ్యవాద యుద్ధంనుండి వుపసంహరించుకొనటం. విప్లవంయొక్క ప్రధానశక్తి: శ్రామికవర్గం. అందుబాటులోని రిజర్వు: బీదరైతాంగం. ఇరుగుపొరుగుదేశాలలోని శ్రామికవర్గం బహుశః తోడ్పడగల రిజర్వులు. దీర్ఘంగా సాగుచున్న యుద్ధం, సామ్రాజ్యవాదంలో బయలుదేరిన సంక్షోభం అనుకూల విషయాలు. ప్రధానమగు దెబ్బను కొట్టవలసినదిక్కు: రైతాంగమందలి కష్టజీవులగు ప్రజాసామాన్యాన్ని తమవైపు ఆకర్షించుటకూ, సామ్రాజ్యవాదంతో రాజీపడి విప్లవాన్ని తుదముట్టించుటకూ ప్రయత్నిస్తున్న పెటీ - బూర్జువా డెమొక్రాట్లను (మెన్షివిక్కులను, సోషలిస్టు రివల్యూషనరీలను) ప్రజా సామాన్యంనుండి దూరం చేయటం. విప్లవశక్తులను మోహరించుటకై ప్లాను: బీదరైతాంగముతో శ్రామికవర్గం మిత్రత్వం.

"బూర్జువావర్గంయొక్క ప్రతిఘటనను బలప్రయోగంతో అణచివేయుటకూ, రైతాంగముయొక్క, పెటీ-బూర్జువావర్గంయొక్క అస్థిరత్వమును స్తంభింపజేయుటకూ, ప్రజాబాహుళ్యంలోని అర్ధకార్మికవర్గ (సెమిప్రోలిటేరియన్) శక్తులతో కలిసి, శ్రామికవర్గం సోషలిస్టు విప్లవాన్ని పూర్తిగావించాలి." (పైగ్రంథం పేజీ 4-5)

దీన్నే ఇంకా క్లుప్తంగా చెప్పాలంటే వ్యూహం ప్రత్యేకమైన వర్గసంబంధం. అధికారాన్ని చేజిక్కించుకొనియున్న శత్రువును దెబ్బ గొట్టడానికి శ్రామికవర్గం తీసుకొని రావలసిన విప్లవశక్తులను క్రమబద్ధంగా తీసుకొనిరావడం; మొత్తం ఆ విప్లవదశకంతటికీ ఇది అమల్లో

ఉంటుంది. మన విప్లవదశకు మనం పన్నిన వ్యూహం ఏమిటి? ప్రజాస్వామిక సంఘటన అనే ఒక ముక్కలో–నినాదంలో – మన వ్యూహం ఏమిటో బహుస్పష్టంగా తెలియపరచడమైనది. ప్రజాస్వామిక సంఘటన అంటే బూర్జువా – ఫ్యూడల్ – సామ్రాజ్యవాద సమ్మేళనకు వ్యతిరేకంగా కార్మికవర్గమూ, రైతులూ, అణచబడిన మధ్యతరగతి యొక్క వర్గసమ్మేళన అని నిర్వచించ బడింది.

లెనిన్ పరిభాషలో మన వ్యూహాన్ని నిర్వచించాలంటే ఈ క్రిందివిధంగా నిర్వచించవలసి ఉంటుంది.

లక్ష్యం: సామ్రాజవాద – బూర్జువా – ఫ్యూడల్ సమ్మేళనకు అగ్రగామిగాఉన్న బూర్జువావర్గంయొక్క అధికారాన్ని కూలద్రోయడం, మధ్యయుగీన అవశేషాలన్నిటిని పూర్తిగా తుడిచిపెట్టివేయడం, పరిశ్రమలు వగైరాలను జాతీయం చేయడంద్వారా పరివర్తన కాలానికి సంబంధించిన ఆర్థిక విధానాన్ని అమలుజరపడం వగైరాలు. విప్లవ ప్రధాన శక్తులు: శ్రామికవర్గం వెంటనే ఉపయోగించే రిజర్వులు: వ్యవసాయకార్మికులు, పేదరైతులు, మధ్యతరగతి రైతులు (అణచబడిన పట్టణ పెటీబూర్జువావర్గంకూడా). ప్రధానమైన దెబ్బ గొట్టేదిశ: అధికారంలోఉన్న బూర్జువా గ్రూపులతోపాటు తదితర బూర్జువా, పెటీబూర్జువా పార్టీలనూ గ్రూపులనూ (సోషలిస్టుపార్టీ మొదలైనవాటిని) ప్రజలనుంచి దూరం చేయడం. విప్లవశక్తులనొక క్రమబద్ధపద్ధతిలో నడిపించే ప్రణాళిక: కార్మికవర్గంతో శ్రమజీవులైన రైతుల సన్నిహిత సంబంధం, వ్యవసాయకూలీలపై, పేదరైతులపై స్థిరంగా ఆధారపడడం. "బూర్జువావర్గాన్ని ప్రజలనుంచి దూరంచేయడానికి బల ప్రయోగంతో వాళ్ళ ప్రతిఘటనను అణచివేయడానికీ శ్రామికవర్గం తాను వ్యవసాయ కార్మికులతో పేదరైతులతో ఘనిష్ఠమైన మైత్రినెరపుతూ, మధ్యతరగతి రైతులు తనను అనుసరిస్తూ ఉండగా శ్రామికవర్గం నూతన ప్రజాతంత్ర విప్లవాన్ని పూర్తి చేయవలసి ఉంటుంది."

ఈనాడు మనం భాగస్వాములుగా ఉండి పాల్గొంటున్న విప్లవ దశలో రష్యావిప్లవంయొక్క రెండు దశలూ గోచరమవుతున్నాయి. బూర్జువావర్గాధికారాన్ని ప్రజలనుంచి దూరం చేయడానికి అంతం

చేయడానికి మనం కృషి జేయవలసి వస్తుంది. కాని రష్యా విప్లవం యొక్క రెండవదశలో ఇలాంటిదేమీ జరుగలేదు అనే విషయాన్ని మనం ముఖ్యంగా గమనించాలి. రష్యా విప్లవంయొక్క రెండవదశలో పెటీబూర్జువా ప్రజాస్వామిక వాదులపై పే ప్రధానమైన దెబ్బగొట్టడం జరిగింది.

ఎందుకంటే అప్పటికే బూర్జువా పార్టీలన్నీ అప్రతిష్ఠ పాలయ్యాయి. సోవియట్లలో తమ కార్యకలాపాలను సాగిస్తూ ఉన్న పెటీ బూర్జువా మెన్షివిక్కులద్వారానూ, సాంఘిక విప్లవవాదుల (సోషల్ రివల్యూషనరీల) ద్వారా మాత్రమే ఆనాడు బూర్జువావర్గం రక్షింపబడుతూ ఉంది. ప్రజలు మోసగింపబడుతూ ఉన్నారు.

ఇక మన దేశంలోనో! అధికారంలో ఉన్న బూర్జువా వర్గానికే–కాంగ్రెసు నాయకత్వానికే–ప్రజల్లో ఇతర పెటీబూర్జువా పార్టీలన్నింటి కంటె చాలా ఎక్కువ పలుకుబడి ఉంది. కాంగ్రెసునాయకులు ఇంకా ప్రజల్లో తమ పలుకుబడిని కోల్పోలేదు. కాబట్టి వాళ్ళను అధికారంలో నుంచి కూలద్రోయాలంటే వాళ్ళ నిజస్వరూపాన్ని ఎల్లప్పుడూ బట్టబయలు చేస్తూ వాళ్ళను ముందు ప్రజలనుంచి దూరం చేయవలసి ఉంటుంది.

బూర్జువా నాయకత్వాన్ని ప్రజలనుంచి దూరం చేయవలసిన అవసరాన్ని నొక్కి చెప్పుతూ పార్టీ ద్వితీయ కాంగ్రెసులో ఆమోదించబడిన 'రాజకీయ విధానం' ఇలా ఉద్ఘాటించింది :

ఈ జాతీయప్రభుత్వం పరాయి సామ్రాజ్యవాదులతో చేతులు కలుపుతున్నదనీ, ఆంగ్లో-అమెరికన్ సామ్రాజ్యవాదులకు దేశాన్ని అమ్మివేస్తుందనీ, నాయకులనుసరిస్తున్న విధానాలు మతకలహాలకే దారితీస్తున్నవనీ, పెద్ద పెట్టుబడిదారీవర్గాల ప్రయోజనాలను దృష్టిలో పెట్టుకునే ప్రభుత్వం వ్యవహరిస్తున్నదనీ, ప్రజాసామాన్యం యింకా గుర్తించడంలేదు. దేశానికి చేకూర్చిన ప్రభుత్వంగానే ప్రజలు దానిని భావిస్తున్నారు. కాంగ్రెసు నాయకులంటే భ్రమలకూ, జాతీయ వ్యామోహానికీ ప్రజలు పూర్తిగా లోనయ్యారు. జాతీయ ప్రభుత్వంపట్లం ప్రజలకు గల భ్రమలు త్వరత్వరగా తొలగిపోతున్నా వారికి నెహ్రూపట్ల, కాంగ్రెసుపట్లగల విశ్వాసం ఇంకా పోలేదు. ఎన్నో సార్లు ఆశాభంగం కలిగినా, పాతభ్రమలను వారింకా అంటిపెట్టుకునే ఉన్నారు.

జాతీయప్రభుత్వం అంటే ప్రజలకుగల వ్యామోహాన్ని గమనించకుండా సాగించే విమర్శలు నిష్ప్రయోజనం కావచ్చు.

ప్రభుత్వ విధానాలను విమర్శించేటప్పుడు ఖచ్చితమైన ఉదాహరణలను ఆధారంగా తీసికొనకపోతే, అటువంటి ఉదాహరణలను ఆధారంగా తీసుకొని ఓపికతో వాదించి జాతీయ ప్రభుత్వ విధానాలకు మన నిర్వచనం సరైనదని ప్రజలు గుర్తించేలా చేయకపోతే, కాంగ్రెసుపట్ల ప్రజాసామాన్యానికింకా ఉన్న గాఢవిధేయతను దృష్టిలో ఉంచుకొనకపోతే మన విమర్శలేమీ పనిచేయవు. ప్రజలు రాజీకోరు నాయకత్వాన్ని వదిలేట్లు చేయలేవు.........

ప్రజాతంత్ర ఆశయాలను సాధించేందుకు ప్రజలు పూనుకొనేలా చేయాలంటే, కార్మికవర్గం ప్రజాసామాన్యాన్ని బూర్జువా నాయకత్వంనుండి వేరుచేయాలి. జాతీయ ఐక్యత అంటే నూతన దృక్పథంతో నూతన ఉద్యమాన్ని నిర్మించాలి.

(రాజకీయవిధానం, పేజీ 101 - 102)

ప్రజలను బూర్జువా పలుకుబడిలోనుంచి బైటికి లాగడానికీ, ప్రజలనుంచి బూర్జువా నాయకత్వాన్ని దూరం చేయడానికీ, బూర్జువావర్గాన్ని కూలద్రోసే వ్యూహ ప్రణాళికలో ఒక భాగంగా బూర్జువావర్గ పలుకుబడి పైపు ప్రధానమైన దెబ్బకొట్టవలసి ఉంటుందని పై కొటేషన్‌లో స్పష్టంగా విప్పి చెప్పబడింది.

పైన పేర్కొనబడిన వ్యూహ ప్రణాళిక (స్ట్రాటజిక్ ప్లాన్) సరిగా పార్టీ ద్వితీయ కాంగ్రెసు ఇచ్చిన ప్రణాళికయే అని మనం గుర్తుంచుకోవలసి ఉంటుంది. బాహాటంగా గానీ, గుప్తంగాగానీ, అతివాద విమర్శన అనే ముసుగుక్రింద పరోక్షంగాగానీ, లేక మితవాద సంస్కరణ విధానం పేరుమీద ప్రత్యక్షంగా గానీ పై ప్రణాళికలో ఎట్టిమార్పు జేసినా దాన్ని ఖచ్చితంగా ఎదుర్కోవలసి ఉంటుంది.

("నూతన ప్రజాతంత్రంకోసం, సోషలిజంకోసం పోరాటం" అనే పుస్తకం నుంచి, పేజీ 51-58)

"వర్గాలతో కూడిన సమాజంలో 'మానవ స్వభావం' అనేది ఆయా వర్గాల స్వభావం మాత్రమే. అంతేగాని వర్గ విభేదాలకు అతీతమైన ప్రత్యేక మానవ స్వభావం అనేది లేదు."

మా-సి-టుంగ్.

("కళలూ - సారస్వతం ఎవరి కోసం - పేజీ. 37.)

# వార్గా అభిప్రాయాలపై విమర్శ

కె. వి. ఓస్ట్రోవిటియనోవ్

[కొన్ని ముఖ్య విషయాలపై కామ్రేడ్ వార్గా యొక్క సంస్కరణ వాదాన్ని గురించి సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ చేసిన అమూల్యమైన విమర్శనూ, దానిపై కామ్రేడ్ వార్గా ఆత్మ విమర్శనూ ప్రకటిస్తున్నాం. కాని కేంద్రకమిటీ విమర్శకు తీవ్రంగా గురియైన ఒక ముఖ్య విషయం కామ్రేడ్ వార్గా యొక్క ఆత్మవిమర్శనలో లోపించడం ఇక్కడ ప్రధానంగా గమనించవలసి ఉంటుంది. కామ్రేడ్ వార్గా యొక్క ఆత్మ విమర్శనలో మాకు ఈ క్రింది ప్రధాన లోపం కనిపిస్తూఉంది. (బహుశా వార్గా ఆత్మవిమర్శనయొక్క పూర్తి పాఠం మనకు ఇంకా అందకపోవచ్చు. ఇప్పుడిందులో ప్రచురించబడేది దాని సంగ్రహరూపం మాత్రమే కావచ్చు.) "సామ్రాజ్యవాద దేశాలమధ్య భవిష్యత్తులో సాయుధ సంఘర్షణ జరిగే అవకాశం బహు స్వల్పమాత్రంగానే ఉంది." (అంటే దాదాపు లేదు అనే వార్గా అభిప్రాయం. అనువాదకుడు) అని కామ్రేడ్ వార్గా తప్పుడు సిద్ధాంతీకరణ చేశాడు. ఈవిధంగా సిద్ధాంతీకరించడం అంటే సామ్రాజ్యవాదుల్లోనూ పెట్టుబడిదారుల్లోనూ, ఉన్న పరస్పర వైరుధ్యాలనూ, భావి సాంఘికాభివృద్ధి గమనంలో వాటియొక్క ప్రాముఖ్యతనూ, ఇది స్పష్టంగా తక్కువ అంచనా వేయడమే అవుతుంది. సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ విమర్శించినట్లుగా పెట్టుబడిదారీ విధానాన్ని గురించీ సామ్రాజ్యవాదాన్ని గురించీ, మార్క్స్ లెనిన్ల శాస్త్రీయ పరిశీలనకూ, ఈ సంస్కరణాత్మక దృక్పథానికి ఎక్కడా సంబంధమే లేదు. ఒకవైపున తన సామ్రాజ్యవాదాన్ని విస్తరింపజేయాలనే అమెరికా గొంతెమ్మ కోరికలూ, మరోవైపున ప్రపంచ సోషలిస్టు ప్రజాతంత్రశక్తులు

సాగించే తీవ్రమైన ప్రతిఘటనా, ఇవి సామ్రాజ్యవాదం పెట్టుబడిదారీ విధానాల్లోని అంతర్గత పరస్పర వైరుధ్యాలను ఇంకా తీవ్రతరం చేస్తాయి. అంతేకాని వారిలో వారికి ఘనిష్ఠతా, సన్నిహిత సహకారం ఏర్పడడమనేది దోపిడిచేసే గుత్త పెట్టుబడిదారుల యొక్క, సామ్రాజ్యవాదులయొక్క ఒక మధుర స్వప్నం మాత్రమే. కామ్రేడ్ వార్గా యొక్క ఆత్మ విమర్శనలో ఈ విషయాన్నిగురించి చర్చించబడలేదు;]

—సంపాదకవర్గం

[ఆర్థికశాస్త్ర సంస్థ (ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఎకనమిక్స్) కృషిపైన 1948 అక్టోబరు నెలలో మాస్కోలో జరిగిన చర్చను ముగిస్తూ కె. వి. ఓస్ట్రోవిటియనోవ్ యిచ్చిన ముగింపు ఉపన్యాసభాగాన్ని యీక్రింద ముద్రిస్తున్నాం. దీనిలో వార్గా యొక్క కృషినిగూర్చి, అతను రచించిన "రెండవ ప్రపంచయుద్ధం మూలంగా పెట్టుబడిదారీ ఆర్థిక విధానంలో వచ్చిన మార్పులు" అన్న పుస్తకమునుగూర్చి ప్రధానంగా చర్చించబడింది.]

గతంలో అనేక సందర్భాలలో లాగానే, ఈదఫాకూడ కామ్రేడ్ వార్గా సిద్ధాంతానికి సంబంధించి తనుచేసిన ఘోర తప్పిదాలను అంగీకరించటానికి మొండిగా తిరస్కరిస్తున్నాడు. ఈ తప్పులనుగూర్చి మనపార్టీ పత్రికల్లో అవి సంస్కరణవాద తత్వం గలవిగా నిర్ణయించబడ్డవి. తన లోపాలను తను గుర్తించకపోగా, వాటిని గుర్తించటానికి బదులు తిరస్కరిస్తూ నెమలి యీకలను తనవంటినిండా ధరించాడు. ఈ తిరస్కరించటం అతని ప్రతిభకు ఒక నిదర్శనంగా భావిస్తున్నాడు. కామ్రేడ్ వార్గా తను చాలా ధైర్యశాలి నని యిక్కడనే చెప్పుకున్నాడు. తను ఉత్తరువులకోసం వేచియుండేవాడిని కానని, కొత్త సమస్యలను ధైర్యంగా పరిష్కరిస్తానని, పార్టీ విషయంలో కపటిగా నటించటం తనకు ఏమాత్రం పనికిరాదని, తను ఏది అభిప్రాయపడతాడో అదే బయటకు చెప్పుతానని సెలవిచ్చాడు. ఈ ప్రకటన చాటునవున్న అభిప్రాయం యిదని తేలుతుంది-నిజమైన బోల్షివిక్కుల వలె కామ్రేడ్ వార్గా తన లోపాలను చిత్తశుద్ధితో అంగీకరించటానికి యిష్టపడటంలేదు.

విజ్ఞాన శాస్త్రరంగంలో బోల్షివిక్ సైనిక స్వభావ ప్రాథమిక సూత్రాలను సైతం కామ్రేడ్ వార్గా జీర్ణం చేసుకోలేకపోయాడు. జడనోవ్ చెప్పినట్లు "మన అభివృద్ధికి నిజమైన ప్రేరకశక్తి, పార్టీ చేతిలోవున్న వజ్రాయుధం ఆత్మ విమర్శనే" అన్న వాస్తవాన్ని ఇతను గ్రహించలేక పోయాడు.

నామ మాత్రంగా, సూచనప్రాయంగా తన లోపాలను అంగీకరించమని కామ్రేడ్ వార్గాను ఎవరూ కోరలేదు. మేముకోరిందల్లా యిది: అవమానితుడైన దెబ్బతిన్న శాస్త్రబోధకుని వైఖరిని వదలి చిత్తశుద్ధితోనే లోపాలను పరీక్షించుకోమని, ప్రధానమైన విషయం ఏమిటంటే - ఈ లోపాలను సరిదిద్దుకొని, మార్క్సిస్టు - లెనినిస్టు విజ్ఞానశాస్త్రంయొక్క అవసరాలకు తగిన విధంగా కొత్త కృషిని సల్పమనిమాత్రం

లోపాలను పట్టుకొని ప్రాకులాడటంవల్ల ఎటువంటి విషాదకర ఫలితాలు సంభవించాయో నీవు మనపార్టీ గతచరిత్రనుండి నేర్చుకొని వుండాల్సివుంది. సూత్రీకరించటంలో జయప్రదం కాలేకపోయినట్లు నీ లోపాలను జమకట్ట ప్రయత్నించుతున్నావు. రాజ్యాంగయంత్ర సమస్య సందర్భంగా నీవు యిలాచెప్పుతున్నావు: "అటో యిటో తేల్చేపాత్ర (డెసిసివ్ రోల్) మహత్తరపాత్ర, హెచ్చుపాత్ర - ఈ మాటలన్నీ ఒకటే. మాటలనుగూర్చి మీతో వాదించటం నాకు యిష్టంలేదు. మీ యిష్టంవచ్చిన విధంగా మాటలకు అర్థాలు చెప్పుకోండి."

ఒకప్పుడు ఒక నినాదాన్ని చూసాను. "ఒకపదం - కూడ చర్య అవుతుంది" ఈ విషయంలో నీ అభిప్రాయాలను ఎటువంటి మాటల్లో పొందుపర్చావంటే, ఆ మాటలు సంస్కరణతత్వవాదులకు దారితీస్తాయి ఇంతకు మినహాగా, వాటిని వేరువిధంగా అర్థం చేసుకోవటం అసంభవమౌతోంది.

కామ్రేడ్ వార్గా ఒక్కలోపాన్ని మాత్రంగుర్తించడానికి సిద్ధంగావున్నాడు- యుద్ధదశ యొక్క పరిస్థితులవల్ల తనపుస్తకం యొక్క స్వరం తగుస్థాయిలో మాత్రమే వుందని. స్వరం సంగీతాన్ని సృష్టించుతుందన్నది నిజం. ఈ సందర్భంలో సంస్కరణ తత్వసంగీతం వచ్చింది. ఏమైనప్పటికీ, ఈ సమస్యను స్వరసమస్యగా మార్చటానికి వీలులేదు.

కామ్రేడ్ వార్గా! ఈ సమస్య స్వరానికిగాని, మాటలకుగాని, సంతోషకరంగాని సూత్రీకరణలకుగాని సంబంధించినదికాదని యిప్పటికే నీకు అర్థంఅయి వుంటుంది. సంస్కరణతత్వ పాత్రగలిగిన, ఒక క్రమములో సాగుతున్న లోపాలు యివి. నీ లోపాలను సమర్థించుకోవటంలో నీవు చూపుతున్న మొండితనాన్ని "ధైర్యమనీ" "చిత్తశుద్ధనీ" "నిజాయితీ" అనుకొని నీఅంతటనీవే గర్వపడుతున్నావు. కాని మనపార్టీ, తనసభ్యుల నుండి ఆశించేదిమాత్రం యిది: తనసభ్యులు ఎవరైనా తప్పులుచేసివుంటే, వాటిని ధైర్యంగా చిత్తశుద్ధితో, నిజాయితీపరుడువలె గుర్తించాలని ఆశిస్తోంది. ఆత్మవిమర్శనకు జంకేవారు పిరికిపందలని, ప్రజల మన్ననకు తగినవారు కాదని కామ్రేడ్ జదనోవ్ అన్నాడు.

చివరకు నీ 'నిజాయితీ' పైనకూడ నాకు శంకకల్గుతోంది. నిజంగా రెండో రకానికి చెందిన ప్రశ్నలనుగూర్చి నీవు చర్చించి, సిద్ధాంతరీత్యా నీకు వ్యతిరేకంగా ఎత్తిచూపబడిన సమస్యలను మాట్లాడకుండా మూర్ఖత్వంతో దాటవేసావు. నీపై మోపబడ్డ యీ నేరాలలోని విషయాలకు సమాధానంచెప్పటానికి తిరస్కరించావు. ఈ నీ వైఖరిని 'నిజాయితీ'కి నమూనాగా భావించటానికి సంభవం కావటంలేదు. నీ కృషినిగూర్చి యిచ్చిన విమర్శలో నీవు అంగీకరించిన కొద్దిభాగం గూడ ఏమితెలియచేస్తోంది? నిరంకుశంగా తప్పించుకోచూడటమేకాని, బోల్షివిక్ ఆత్మవిమర్శ గోచరించటంలేదు.

ప్రజల ప్రజాస్వామిక దేశాలలోని ఆర్థిక విధానాన్ని గురించి స్టేట్ క్యాపిటలిజంగా వర్ణించటం తప్పని నీవు అంగీకరిస్తున్నావు కాని ఈ పుస్తకం వ్రాసిన కాలంలో - అంటే 1945 సం॥లో - పై విధంగా వర్ణించటం సక్రమమైనదే అని నీవు చెప్పటంలో నీ అంగీకారం ఎందుకూ కొరగాకుండా పోతోంది. వ్యవసాయ

ములో చిన్న ఎత్తుస్తానే పెద్ద ఎత్తున ఉత్పత్తి చేయటంవల్ల కలుగు సదవకాశాల సమస్యగా మాత్రమే పరిగణించి, దేశానికి సంబంధంలేని రీతిలో ఆ సమస్య చర్చించటానికి ప్రయత్నించావు. కాని యీ లోపానికి మూలం చాలా లోతు వరకు పాతుకపోయింది. నూతన ప్రజా తంత్ర దేశాల్లో ఆర్థికంగా వచ్చిన పరిణామంయొక్క పాత్రను తప్పుగా పరిగణించటమే యీలోపం. పెద్దపెద్ద భూఖండాలను హస్తగతం చేసుకోవటంలోవున్న అభివృద్ధి నిరోధక తత్వాన్నిగూర్చి, యీ విధంగా పెద్దపెద్ద భూఖండాలపై సంపాదించుకునే అధికారంవల్ల గ్రామీణ ఆర్థిక విధానంలోని ఉత్పత్తిశక్తుల అభివృద్ధి దెబ్బతింటుందని లెనిన్ చెప్పిన ఉపదేశాలను మరచిపోవటమే యీ లోపానికి కారణం.

అమెరికాలో సంక్షోభం ఏ దశలో బద్దలవుతుందని నిర్ణయించటంలో తప్పు చేసానని అంగీకరిస్తున్నావు. కాని దీనితో పాటు యిది సిద్ధాంతానికి సంబంధించిన లోపం కాదని ప్రకటిస్తున్నావు.

ఈ విషయాన్ని రెండు పుస్తకాలలో -ఒకటి ఆర్థిక శాస్త్రాన్నిగూర్చి, మరొకటి రాజకీయాలనుగూర్చి- ప్రత్యేకంగా వ్రాయ వూనుకోవటం సరిగాదని అంగీకరిస్తున్నావు. కాని విషయ ప్రాధాన్యత యీవిధంగా రెండు వేర్వేరు పుస్తకాలు వ్రాయటంలో లేదు. ఆర్థిక, రాజకీయ సమస్యలను పరిశీలించిన వైనంలోవుంది. నీవుగనుక యీ రెండుతప్పుడు పుస్తకాలను జతపర్చి ఒకటిగా చేసినట్లయితే, అప్పుడు అది సక్రమఫలితాన్నిస్తుందా? ఈవిధంగా గణితా మాత్రంగా, యంత్రవాదిగా (మెకానిస్టిక్) సమస్యను ఆలోచించటం ఏవిధంగాను సమర్థనీయంకాదు. ఈ వైఖరి పూర్తిగాతప్పు. ప్రధానంగా పార్టీయేతర వైఖరి. లోపాలవూబిలోకి యిది మరింత లోతుకు తీసుకపోతుంది.

ఒక ప్రధానమైనవిషయాన్ని ఇక్కడ క్లుప్తంగా చర్చించాల్సిన అవుసరం వుంది. ఈ ప్రధాన విషయాన్ని చర్చించటానికి కామ్రేడ్ వార్గా యిప్పటివరకూ విముఖతను చూపుతూనేవున్నాడు. అతని అభిప్రాయాలయొక్క సంస్కరణవాద తత్వాన్నేగూర్చి యిక్కడ ముచ్చటిస్తాను.

అసలు ఆ పుస్తకంయొక్క పీఠికలోనే తప్పనిసరిగా సంస్కరణవాద అంత్య నిర్ణయాలకు (రిఫారమిస్టు కన్‌క్లూజన్స్) దారి తీసేవిధంగా పరిశీలన ప్రారంభించాడు. యుద్ధానంతర పెట్టుబడిదారీ విధానం యొక్క స్థితిగతుల్లో పనిచేస్తున్న తాత్కాలిక, అంతర్గత కారణాలను (ఫ్యాక్టర్స్) గురించి నీవు వ్రాసావు. రాబోవు పది సంవత్సరాలలోను తాత్కాలిక కారణాలు (ఫ్యాక్టర్స్) ప్రాధాన్యం వహిస్తవని వూహించిచెప్పావు.

“యుద్ధాత్పూర్వస్థాయిని దెబ్బతిన్న దేశాలలోని ఉత్పత్తి శక్తి సామర్థ్యాలు మరొకసారి అందుకోకలిగినప్పుడే - అంటే పది సంవత్సరాల తర్వాత — మాత్రమే యుద్ధంవల్ల సంభవించిన “ప్రత్యేకమైన” మార్పులు పూర్ణ శక్తి స్వరూపంతో బయటపడతాయి. పెట్టుబడిదారీవిధానం యొక్క ప్రధాన వైరుధ్యం - అంటే సామాజిక ఉత్పత్తి, వ్యక్తిగత దోపిడీల మధ్యనున్న వైరుధ్యం-తీవ్రరూపం ధరించటంద్వారా యివి ప్రదర్శితమవుతాయి. ఉత్పత్తి విడుదలసమస్య-అంటేమార్కెట్ సమస్య - రూపంలో కూడ ప్రధానంగా ఇవి ప్రదర్శితమవుతాయి” (రెండవప్రపంచ

యుద్ధ కారణంగా పెట్టుబడిదారీ ఆర్థిక విధానంలో వచ్చినమార్పులు పేజీ: 12)

పెట్టుబడిదారీ విధానంలోని ప్రధాన వైరుధ్యం యుద్ధంచేత తొలగించబడి దని పై వాక్యాలవల్ల తేలుతోంది. యుద్ధం తాత్కాలికంగా పనిచేసే కొన్ని కారణాలను — (దారిద్ర్యం, దెబ్బతిన్న దేశాలలో వస్తు దారిద్ర్య సంక్షోభం, అమెరికాలో ఉత్పత్తి ముప్పు (ఓవర్‌ప్రొడక్షన్) సంక్షోభం మొదలైనవి)— సృష్టించింది. యుద్ధానంతర పదిసంవత్సరాలకాలంలోను యీ పై కారణాలవల్ల పెట్టుబడిదారీ ఆర్థిక విధానంయొక్క పరిణామం నిర్ణయించబడుతుంది. పది సంవత్సరాల తదనంతరం మాత్రమే పెట్టుబడిదారీ విధానం యొక్క వైరుధ్యం తీవ్రతర మవుతుంది. వస్తువిడుదల సమస్య అప్పుడు మాత్రమే తీవ్ర రూపం ధరిస్తుంది.

ఇందులోని మార్క్సిస్టు విజ్ఞతనుగూర్చి ప్రస్తావించను. ఎందువల్లనంటే సమస్యను పై విధంగా చూడటం అనేది-స్పష్టంగా చెప్పాలంటే — వట్టి అజ్ఞానం అని చెప్పాలి. యుద్ధకాలంలోను, యుద్ధానంతరంకూడ పెట్టుబడిదారీ విధానంయొక్క ప్రధాన వైరుధ్యం తొలగించబడుతుందనే సిద్ధాంతాన్ని ముందుపెట్టుతూ, అదే కాలంలో అమెరికాలో సంక్షోభం వస్తుందని వూహించటం అసంభవం. మనదృష్టిని మరోముఖ్య విషయానికి మరలించాల్సి వుంది. కా. మేడ్ వార్గాయొక్క సంస్కరణతత్వ దృక్పథానికి సిద్ధాంత పునాది పైన వివరించినదే. అంటే పెట్టుబడిదారీ విధానం యొక్క ప్రధాన వైరుధ్యం తాత్కాలికంగా తొలగించబడినదన్న సిద్ధాంతమే. "బూర్జువారాజ్యాంగయంత్రం యొక్క అటోయిటో (డెసిసివ్) తేల్చే పాత్ర", యుద్ధకాలంలో పెట్టుబడిదారీ విధానంయొక్క "చట్టబద్ధమైన (ప్లాన్‌డ్) పాత్ర" మొదలైనవి వార్గా సంస్కరణ తత్వ దృక్పథానికి ఆధారం.

యుద్ధకాలంలో బూర్జువా రాజ్యాంగ యంత్రంయొక్క పాత్రను తన అభిప్రాయాలకు తగినట్లుగా చిత్రిస్తున్నాడు. యుద్ధ నిర్వహణా ప్రయోజనాలకోసం, గుత్త పెట్టుబడుల మొత్తం ప్రయోజనాల కోసం, బూర్జువావర్గం అంతటి యొక్క స్వప్రయోజనాలకోసం కొన్ని సమయాలలో రాజ్యాంగయంత్రం వ్యక్తిగత గుత్త వ్యాపారస్తులకు వ్యతిరేకంగా పనిచేయక తప్పిందికాదని ఘంటాపథంగా చెప్పుతున్నాడు. నిజంగా కామ్రేడ్ వార్గా అభిప్రాయంయొక్క సారాంశం ఈఅంత్య నిర్ణయమే (కన్‌క్లూజన్) అయినట్లయితే, అసలు భేదాభిప్రాయానికి తావేలేదు. కాని ఈ విషయంలోకూడా కామ్రేడ్ వార్గా - తన "ధైర్యానికి" "నిర్మొఖమాటానికి" స్వస్తిచెప్పి తన అభిప్రాయాలకు ముసుగులు తొడిగి, పూతలు పూస్తున్నాడు.

యుద్ధకాలంలో గుత్తవ్యాపారసంస్థలపై రాజ్యాంగయంత్రం అధికంగా ఆధారపడి యుండలేదని, పైగా తగ్గిందని కా. మేడ్ వార్గా తర్కిస్తున్నాడు. శాంతియుత కాలంలో గుత్త పెట్టుబడుల చేతుల్లోఒక ఆయుధంగా వున్నప్పటికీ, యుద్ధ కాలములోమాత్రం అది బూర్జువావర్గం మొత్తం ప్రయోజనాలను కాపాడుతూ, గుత్త పెట్టుబడులు స్టేట్ మొనాపలీస్‌లో ఐక్యమయ్యేక్రమాన్ని పరిమితం చేస్తుంది. ఏమైనప్పటికి యుద్ధకాలంలో ప్రభుత్వ యంత్రంపైన, రాజ్యాంగయంత్రంపైన గుత్తవ్యాపారసంస్థలకున్న ప్రభావం తగ్గక

పోగా పెద్దఎత్తున అభివృద్ధి చెందిందన్నది యదార్థం. ఇంతేకాకుండా గుత్త పెట్టుబడుల చేతుల్లో రాజ్యాంగయంత్రం ఒక ఆయుధంగా ఎన్నో విధాల ఉపయోగపడింది.

యుద్ధకాలపు నిర్ణీత ఆర్థికవిధానం గుత్తపెట్టుబడుల ప్రయోజనాలను ప్రధానంగా దృష్టిలో పెట్టుకొని కొనసాగించబడింది. కొన్ని ప్రత్యేకమైన గుత్త వ్యాపారసంస్థల కోర్కెలను రాజ్యాంగ యంత్రం పరిమితం చేయటానికి, అది గుత్త పెట్టుబడుల చేతుల్లో ఒక ఆయుధం అని, దాని పాత్రను నిర్ణయించటానికి మధ్య ఎట్టి వైరుధ్యంలేదు. గుత్తపెట్టుబడుల ప్రయోజనాలకోసం రాజ్యాంగయంత్రం పనిచేస్తూనే, సమ్మెలను, విప్లవవిజృంభణలను ఎదుర్కోవలసి వచ్చినప్పుడు తన నియంతృత్వాధికార గుప్పెట్లో కార్మికులను గట్టిగా అట్టిపెట్టుకోవటంకోసం, కార్మికవర్గంయొక్క కోర్కెలలో కొన్నింటిని అంగీకరించక తప్పని పరిస్థితి ఏర్పడుతుంది. గుత్తపెట్టుబడిదార్ల చేతుల్లో రాజ్యాంగయంత్రం ఒక ఆయుధం అన్న విషయాన్ని ఇదంతా ఖండించకపోగా, దీనినే బలపరుస్తోంది.

యుద్ధకాలపు ఆర్థికవిధానం నిర్ణీత మార్గంలో వుండటం సంభవమే అన్న తనలోపం సూత్రీకరించటంలో వచ్చిన తప్పని చెప్పుతూ, తనలోపాలను కామ్రేడ్ వార్గా తగ్గించ ప్రయత్నిస్తున్నాడు. ఈ సందర్భంలో తన పుస్తకంలోని రెండవ అధ్యాయాన్ని ప్రస్తావిస్తున్నాడు. పై ప్రకటనచేస్తూనే కామ్రేడ్ వార్గా తన ఉపన్యాసంలో యుద్ధపరిస్థితుల్లో పెట్టుబడిదారీ ఆర్థికవిధానం నిర్ణీతమార్గంలో నడవాల్సిన అవసరంవుందని అవకాశం కలదని తిరిగి వాదిస్తున్నాడు. యుద్ధం చేయటానికి విమానాలు, టాంకులు, మొదలైనవి కావాలికనుక ప్రభుత్వమే (స్టేట్) సైనికావసరాలను తీర్చాలికనుకనూ, అందువల్ల ప్రభుత్వం ఒక 'ప్రణాళిక' సిద్ధపర్చుకోక తప్పదు. అంటే ముడి సరుకు పంపిణీ, వివిధసంస్థల అధ్వర్యాన సరుకు నిల్వవుంచటం మొదలైనవి చేయక తప్పదు. కామ్రేడ్ వార్గా చేసిన ఘోర తప్పిదం ఏమిటంటే ఆర్థికవిధానంలో బూర్జువా రాజ్యాంగ యంత్రం ప్రవేశ పెట్టిన యుద్ధనియమావళిని జాతీయ ఆర్థిక ప్రణాళికతో పోల్చుతున్నాడు.

పెట్టుబడిదారీ విధానానికి మూలమైన అరాచకాన్ని, అంటే పెట్టుబడిదారీ విధానం యొక్క ప్రధాన వైరుధ్యాన్ని - ఉత్పత్తి విధానంలో ఉత్పత్తికిగల సామాజికపాత్రకు, వ్యక్తిగత ఆస్తికీ మధ్యగల వైరుధ్యం - నిర్మూలించటమన్న విషయాన్నుంచి పెట్టుబడిదారీ ఆర్థికవిధానాన్ని నిర్ణీతమార్గంలో నడిపించటానికిగల అవకాశాలను వేరుచేయటానికి వీలులేదు. యీ వైరుధ్యం వున్నంతకాలం నిర్ణీత మార్గాన్నిగూర్చి మాట్లాడటానికే వీలులేదు. "నిర్ణీతమార్గం" అన్న ఈ సిద్ధాంతాన్ని సమర్థించుకోవటంకోసమే కదా, యుద్ధకాలంలోను, యుద్ధానంతరంకూడ పెట్టుబడిదారీవిధానంయొక్క ఈ ప్రధాన వైరుధ్యం పనిచేయటం ఆగిపోతుందని కామ్రేడ్ వార్గా తన పీఠికలో వ్రాసింది? రాజకీయదుర్గం (పొలిటికల్ సూపర్ స్ట్రక్చర్) గా పనిచేస్తున్న బూర్జువా రాజ్యాంగయంత్రం ఆర్థిక విధానంపైన విధించే మారు చర్యను (రెసిప్రోకల్ యాక్షన్) మార్క్సిస్టు-లెనినిస్టు మూల గ్రంథాలు కాదనటంలేదు. కాని

యీ మారుచర్యమాత్రమే, ఆర్థికవిధానం యొక్క "నిర్ణీతమార్గాన్ని" ఏవిధంగాను నిర్ణయించదు. సిద్ధాంతరీత్యా ఆలోచించి నట్లయితే యిది పూర్తిగా యింకోరకానికి చెందినట్టిదని తెలుస్తుంది. బూర్జువా రాజ్యాంగయంత్రం ఆర్థికంగా వహించే పాత్ర ఆర్థికవిధానంపైద నిఉన్న ప్రభావం చాలా పరిమితమైంది. అదికూడ కొన్ని అత్యంత అనుకూలపరిస్థితుల్లోనే ప్రాథమిక ఆర్థికాభివృద్ధికి సహాయపడటానికి గాని, లేక ఆ ప్రాథమిక ఆర్థికాభివృద్ధిని తొక్కిపట్టటానికిగాని మాత్రమే దాని పాత్ర పరిమితమై వుంటుంది.

సామ్రాజ్యవాద దశలో రాజ్యాంగ యంత్రం ఆర్థిక విధానంలో జోక్యం కలుగజేసుకోవటంవల్ల ఉత్పత్తి శక్తుల అభివృద్ధి వెనక్కు లాగబడుతుంది. యుద్ధకాలపు నియమావళి పెట్టుబడిదారీవిధానం యొక్క ప్రధాన వైరుధ్యాన్ని నిర్మూలించక పోగా, పైగా దానిని తీవ్రతర మొనర్చటానికి దారితీసింది. ఈ నియమావళి గుత్తపెట్టుబడుల ప్రయోజనాలకోసం తయారు చేయబడింది కనుక, బూర్జువా వర్గంలోని వివిధ ముఠాల మధ్య నున్న వైరుధ్యాలను ఎక్కువచేసింది. కార్మిక వర్గాన్ని, శ్రామికజనాన్ని తొక్కిపట్టటం కోసం, తద్వారా యుద్ధ భారాన్నంతా వీళ్ళ వీపుమీద పడవేయటంకోసం ఇది ఉపయోగించబడింది. అందువల్ల కార్మిక వర్గానికి, బూర్జువావర్గానికి మధ్యనున్న వైరుధ్యం మరింత తీవ్రరూపం ధరించింది. ఇది ఆర్థికవిధానం ఒక వైపుగా అభివృద్ధి చెందటానికి మాత్రమే మార్గం చూపుతోంది కనుక వివిధ పారిశ్రామిక శాఖలను ప్రత్యేకమైన సంస్థలకు మధ్యనున్న హెచ్చుతగ్గులను మరింతగా స్పష్టమొనర్చాయి. ఫైనాన్స్ పెట్టుబడుల స్వాములకు యిందువల్ల అపార లాభాలు పెంచుకోవటానికి అవకాశం కల్గుతోంది. శ్రామిక జనుల యొక్క (కన్‌సమ్షన్) కొనుగోలు శక్తిపై పెద్దదెబ్బ తీయటం జరుగుతోంది.

ఇదంతా పెట్టుబడిదారీ విధానంయొక్క ప్రధాన వైరుధ్యాన్ని తీవ్రతర మొనర్చుతుంది. ఇందువల్లఉత్పత్తియుంపులవల్ల (ఓవర్ ప్రొడక్షన్) సంభవించే ఆర్థికసంక్షోభాలు తప్పనిసరి అవుతాయి. కనుక నే యుద్ధకాలంలోగాని, యుద్ధానంతరంగాని పెట్టుబడిదారీ ఆర్థిక విధానం యొక్క నిర్ణీత మార్గాన్ని గూర్చి మాట్లాడటానికీ వీలు లేదని యిందువల్ల తేలుతోంది. దానికి వ్యతిరేకంగా వక్కాణించటం అంటే సంస్కరణతత్వ దృక్పథాన్ని స్వీకరించటమే.

ఈ మార్క్సిస్టేతర దృక్పథంనుంచి బయలుదేరిన కామ్రేడ్ వార్గా యుద్ధానంతర కార్మికోద్యమాన్నిగూర్చి శుద్ధ సంస్కరణతత్వదృష్టిని చిత్రించాడు. అతను యిలా వ్రాసాడు.

"భవిష్యత్తులో రాజ్యాంగ యంత్రంయొక్క పాత్ర యుద్ధాత్పూర్వంకన్నా ప్రధానమైన స్థానం అలంకరిస్తూనేవుంటుంది."

"పెట్టుబడిదారీసమాజంలోని ప్రధాన వర్గాల-బూర్జువావర్గం, కార్మికవర్గం-మధ్య జరుగు రాజకీయ పోరాటస్థాయినిబట్టి రాజ్యాంగ యంత్రంయొక్క ప్రాముఖ్యత యొక్క పెరుగుదలకాక తరుగుదలసమస్య ఆధారపడివుంటుంది." (పేజీ 318)

"ప్రపంచ ఆర్థిక విధానం: ప్రపంచ రాజకీయాలు" (నెం. 10. 1947) సంచికలో "గత ముప్పయి సంవత్సరాలలో

సోషలిజం, పెట్టుబడిదారీ విధానం" అన్న వ్యాసంలో కామ్రేడ్ వార్గా యీ సంస్కరణ తత్వ సిద్ధాంతాన్ని యింకా అభివృద్ధిచేశాడు. అందులో యిలా రాసాడు.

"పెట్టుబడిదారీ విధానానికి జన్మభూమి యూరప్ ఖండం. అట్టి యూరప్‌లోని బూర్జువావర్గం, పెట్టుబడిదారీ సామాజిక వ్యవస్థలో ప్రధానమైన సంస్కరణ తీసుకురావాల్సిన అవసరాన్ని తనంతటతానే గుర్తిస్తోంది. ఉత్పత్తి విధానంలోని ప్రధాన శాఖలను జాతిపరం చేయటం, ఆర్థికవిధానంపైన రాజ్యాంగ యంత్రానికి అధికారం అప్పగించటం, 'ఆర్థిక విధానాన్ని నిర్ణీతమార్గంలో నడిపించటం' మొదలైన చర్యలు తీసుకోక తప్పదని గుర్తిస్తోంది. అక్టోబరు మహావిప్లవానంతరం ముప్పయి సంవత్సరాల తర్వాత నేటికి యూరప్‌లోని పోరాటం దాని చారిత్రకాభివృద్ధిని అనుసరించి, పెట్టుబడిదారీ విధానంనుంచి సామ్యవాదానికి పరిణితి చెందటానికి కావలసిన స్థాయిల, రూపాలనుగూర్చి పోరాటంగా మారుతోంది."

బూర్జువావర్గం, కార్మికవర్గం రెండూ కూడ సామ్యవాదానికై పోరాడుతున్నాయని పైదానినిబట్టి అనుకోవాలి. అయితే యీ రెండువర్గాల మధ్యనున్న భేదమల్లా పోరాటంయొక్క స్థాయిలనుగూర్చి, రూపాలనుగూర్చి మాత్రమే.

కామ్రేడ్ వార్గా! దీనిని ఏమనాలి? ఈ వివాదం పదాలపైనా, విషాదకర సూత్రీకరణలపైన వచ్చినట్టిదేనా? కాక సంస్కరణతత్వంపైన యింకా స్పష్టంగా చెప్పాలంటే లేబరిస్టుల సిద్ధాంతంపైన వచ్చినట్టిదా? ఇదే విషయం పత్రికల్లోను, 'ఆర్థికసమస్యలు' అన్న పత్రిక ఒకటో సంచికలో అచ్చుఅయిననాడు ఉపన్యాసంలోను నీ దృష్టికి తేబడింది నీవు యీ సమస్యను ఎందుకు దాటేస్తున్నావు? ఈ సిద్ధాంతాన్ని యింకా నీవు సమర్థిస్తున్నావో లేక తిరస్కరిస్తున్నావో ఎందుకు తెగవేసి చెప్పలేదు? ఎంతగా మనస్సును కుదవపెట్టుకు ప్రయత్నించినా నీపై మోపబడిన నేరాలనుగూర్చి యీ విధంగా సంకటాన్నిబట్టి 'నీవు ధైర్యశాలివి' అనిగానీ, 'చిత్తశుద్ధి' కలవాడివి అనిగాని, "ఆత్మోన్నతి" ఉన్నవాడివనిగాని నమ్మేందుకు ఆధారం కనపడదు.

సంస్కరణ తత్వంగల యీ ప్రమాదకరమైన లోపాలనన్నింటినీ కామ్రేడ్ వార్గా తన పుస్తకంపైన సాగిన చర్చల తర్వాతకూడ చేసాడు. తను చేసిన తప్పులపై యిచ్చిన విమర్శన విషయంలో కామ్రేడ్ వార్గా పార్టీయేతర వైఖరి అవలంబించిన కారణంగా ఆ తప్పులను సరిదిద్దుకుంటూ ముందుకు పోకపోగా అతను రాసిన ప్రతివ్యాసంలోను, అతను చేసిన ప్రతిపనిలోను యీ పొరపాట్లు ఎన్నోరెట్లు అధికమయాయనటానికి యిదంతా ప్రబలనిదర్శనం. ఈ చర్చలోని అతని వాదనకూడ దానినే బలపర్చుతోంది. వార్గా మాట్లాడినతర్వాత అనేకమంది కామ్రేడ్స్ నూతనంగా కామ్రేడ్ వార్గా చేసిన పొరపాట్లను ఎత్తిచూపారు. సామ్రాజవాద దేశాలమధ్య భవిష్యత్తులో సాయుధ సంఘర్షణకు అవకాశం చాలా తక్కువ అని కామ్రేడ్ వార్గా భావిస్తున్నాడు. భవిష్యత్తులో వెనువెంటనే గాని, లేక కొంతకాలం పోయినతర్వాత గాని సామ్రాజ్యవాద కూటమిలోని వైరుధ్యం ఖచ్చితంగా ఏరూపం తీసుకో

బోతున్నదో ఇప్పుడుమాత్రంజోస్యంచెప్పలేను. అమెరికన్ సామ్రాజ్యవాదం ప్రపంచ పెత్తనానికైజరుపుతున్న పెనుగులాట పశ్చిమ యూరప్ దేశాలను బానిస శృంఖలాలమధ్య బంధించటం - ఇవన్నీ వున్న వైరుధ్యాలను తప్పనిసరిగా తీవ్రతర మొనర్చుతాయి. అందువల్ల ఈ వైరుధ్యాల ప్రాధాన్యతను తక్కువ అంచనా వేయటం మహా తప్పిదం అవుతుంది.

సామ్రాజ్యవాదాన్నిగూర్చి లెనినిస్టు - స్టాలినిస్టు సిద్ధాంతంయొక్క మూలథీసిస్‌ను తిరిగి రాయటానికి (రివైజ్) పూనుకొన్న కామ్రేడ్ వార్గా ప్రయత్నాల్ని పైకారణాలవల్ల తప్పనిసరిగా తిరస్కరించాలి. సామ్రాజ్యవాద దశలో పెట్టుబడిదారీ విధానంయొక్క పెరుగుదల-ఆర్థికంగాను, రాజకీయంగాను - లోని హెచ్చుతగ్గులవల్లనూ, పెట్టుబడిదారీవిధానం మొత్తంగా సంక్షోభానికి గురి కావటంవల్లనూ, సామ్రాజ్యశక్తులమధ్య యుద్ధాలు తప్పనిసరి అవుతాయి అని లెనినిస్టు - స్టాలినిస్టు సిద్ధాంతం చెప్పుతోంది.

“మార్షల్ ప్లాను”ద్వారా పశ్చిమ యూరప్ పెట్టుబడిదారీ దేశాలలో బానిస శృంఖలాల మధ్య బంధించటాన్ని “దారిద్ర్యం” అంటూ సమర్థించటంకూడ శుద్ధతప్పు, హానికరమైనది. తమ జాతికి ద్రోహంచేసి, అమెరికన్ సామ్రాజ్యవాదులకు దాసోహమన్న పశ్చిమ యూరపియన్ బూర్జువావర్గం ‘పేదరికం’ పేరిట తమ ద్రోహాన్ని కప్పిపుచ్చుకో చూస్తోంది. కామ్రేడ్ వార్గా పైవిధంగా వక్కాణించటంవల్ల ఆ బూర్జువావర్గానికి సాయపడుతున్నాడు.

దీనివల్ల తేలే పర్యవసానం ఏమిటి? కామ్రేడ్ వార్గా యిలాగే తన సంస్కరణతత్వ లోపాలను మొండిగా సమర్థించుకొంటూవుంటే, ఇకముందు అతను చేసే కృషిఅంతా వట్టి నిష్ఫలమవుతుంది. తన సంస్కరణ తత్వ అభిప్రాయాలను ధైర్యముగా, మర్యాదగా పునరాలోచించుకోవటం తన భావిశాస్త్ర కృషికి విజయానికి తప్పనిసరి అవుతుంది. మార్క్సిస్టు - లెనినిస్టు మార్గంయొక్క స్పిరిట్‌తో సామ్రాజ్యవాదంయొక్క సమస్యలపైన కృషిచేయటం తప్పనిసరి అవుతుంది.

(కమ్యూనిస్టు రివ్యూ: మే 1949 సంచికనుండి)

## సామ్రాజ్యవాదాన్ని గురించిన రచనలలో:

# సంస్కరణవాద : పోకడలు :

ఇ. వార్గ

యుద్ధానంతరం నేను రచించిన "రెండవప్రపంచ యుద్ధంవల్ల పెట్టుబడిదారీ ఆర్థికవిధానంలో వచ్చిన మార్పులు" అన్న గ్రంథాన్నిగూర్చి, నా అధ్వర్యాన కొంతకాలం క్రితంవరకూ నడుస్తూవచ్చిన "ప్రపంచ ఆర్థికవిధానం: ప్రపంచ రాజకీయాలు" అన్న సంస్థయొక్క కృషిని గూర్చి పార్టీపత్రికల్లోను, శాస్త్రచర్చలలోను సునిశితంగా విమర్శించబడిందన్న సంగతి సువిదితమే. పై సంస్థకు నాయకత్వం వహిస్తూ వచ్చాను కాబట్టి దీనికంతా బాధ్యతనాదే. ఈ విమర్శ అవసరమైనట్టిదేగాక సరియైనదికూడ. ఈ విమర్శయొక్క విలువను వెంటనే గుర్తించకపోవటంలో నాయొక్క తప్పిదం గర్భితమైవుంది. నాతోటి కామ్రేడ్స్ వెంటనే గుర్తించగల్గారు. కాని ఆలస్యంగానైనా గుర్తించటం ఎన్నటికీ గుర్తించకపోవడంకన్నా మెరుగు.

అసలు ముఖ్యమైనవిషయమేమిటంటే నా గ్రంథమంతటా నిండివున్న లోపాలు వాటి స్వభావం చాలాముఖ్యం. పెట్టుబడిదారీ విధానంపై రెండవప్రపంచ యుద్ధప్రభావంవంటి బలమైన సమస్యను మొట్టమొదటిసారిగా స్వతంత్రించి అవగాహనచేసుకొని రాసే పుస్తకంలో లోపాలు రాకుండా చూడడం చాలా కష్టం. విమర్శకులు సరిగా వేలుపెట్టి చూపెట్టినట్లు సంస్కరణతత్వ పోకడ కల్గిన లోపాలు దీనిలో గట్టిగా పేరుకొన్నాయి చివరకు తేలిన పర్యవసానమేమిటంటే నేను సామ్రాజ్యవాదాన్ని ఆకళింపుచేసుకోవటంలో లెనినిస్టు - స్టాలినిస్టు మార్గాన్ని పూర్తిగా విడనాడటం. ఈ లోపాలకు ప్రధాన కారణంయిదే.

సంస్కరణతత్వ పోకడగల్గిన ఈ లోపాలు కాస్మాపొలిటన్ పోకడ గల్గిన లోపాలనుకూడ సూచిస్తున్నాయని ప్రత్యేకించి చెప్పనవసరంలేదు. ఎందువల్లనంటే అవి పెట్టుబడిదారీ విధానాన్ని అంటిపెట్టుకొని వుంటాయి కనుక.

చారిత్రాత్మకమైన ప్రస్తుత పరిస్థితులలో ప్రతి సంస్కరణ తత్వపొరపాటూ, మార్క్సిస్టు - లెనినిస్టు ఉపదేశాలను మలినపర్చే ప్రతిచర్య చాలాప్రమాదకరం.

పెట్టుబడిదారీ విధానంలో జనరల్ సంక్షోభం తీవ్రతరమయే కొలదీ, బూర్జువావర్గం శ్రామిక జన సామాన్యానికి వ్యతిరేకంగా, కమ్యూనిజానికి వ్యతిరేకంగా, కమ్యూనిజానికి కోటలా గావున్న సోవియట్ రష్యాకు వ్యతిరేకంగా సాగించు తున్న పోరాటంలో, అది సంస్కరణ వాదులపైన ఎంతో పదిలంగా ఆధార పడుతోంది బూర్జువా దేశాలలో బూర్జువా వర్గం సంస్కరణవాద విద్రోహులమధ్య పరస్పరసహకారం సన్నిహితంగావుంది. సంస్కరణవాదులు బూర్జువా వర్గానికి ఎంతో కొంత పాదసేవచేస్తూ వుండటం, కార్మికుల ప్రయోజనాలను ద్రోహం చేస్తూవుండటం నిత్యంచూస్తూ నేవున్నాం. (ప్రపంచ కార్మిక సమాఖ్యను విచ్ఛిన్న పర్చే చర్యలు, మార్షల్ ప్లానుకు, ఉత్తర అట్లాంటిక్ ఒడంబడికకు అనుకూలంగా జరుపుతున్న ఆందోళన సోవియట్ రష్యా పైన సాగించుతున్న దుష్ప్రచారం మొద లైనవి)

గ్రేట్ బ్రిటన్, స్కాండి నేవియన్ దేశాలు, ఆస్ట్రేలియా మొదలైనదేశాలలో సంస్కరణవాదులు "అధికారంలో" వున్నారు. దీని అర్థం ఏమిటంటే బూర్జువా వర్గం తన వర్గాధిక్యతను, తన వర్గప్రయోజ నాలను కార్మికవర్గ ద్రోహులచేతుల్లో ప్రత్యక్షంగా వుంచింది. (ఈ ద్రోహులే అనేక యితర దేశాలలో సంకీర్ణ ప్రభుత్వా లలో బూర్జువావర్గంతో పాటు చేయి చేయి కలిపి పనిచేస్తున్నారు. చివరకు గ్రీస్‌లో కార్మికులను ఊచకోతకోస్తున్న ఫాసిస్టులతో సైతం సహకరిస్తున్నారు.)

ఈ సంస్కరణవాదులు అనేక కల్లి బొల్లి కబుర్లతో కార్మికులను మభ్యపెట్టి చూస్తున్నారు. తాము అధికారంలోకి వచ్చారు కాబట్టి బూర్జువా రాజ్యాంగ యంత్రాన్ని కార్మికవర్గం చేతిలోని ఒక సాధనగా మార్చివేస్తున్నామని గప్పాలు కొట్టుకున్నారు. విప్లవం లేకుండానే, శాంతియుత పద్ధతుల్లో సోషలిజాన్ని సాధిస్తున్నామనిదంబాలుపలుకుతున్నారు. ఈ విప్లవ ప్రతీఘాత విద్రోహాన్ని ఎలా బట్టబయలు చేయాలి? ఎలా పరిమార్చాలి? బూర్జువా రాజ్యాంగయంత్ర స్వభావాన్ని గూర్చిన మార్క్సిస్టు - లెనినిస్టు ఉపదేశా లను ఖచ్చితంగా సమర్థిస్తూ సంరక్షించటం ద్వారానే యీపని చేయగలం. ప్రభు త్వానికి నాయకత్వం వహించేది బూర్జువా వర్గమైనా లేక సోషలిస్టులైనా మార్పు ఏమీ వుండదని ఖండితంగా చెప్పాలి.

బూర్జువా రాజ్యాంగ యంత్రాన్ని గూర్చి సంస్కరణతత్వ స్వభావం గల్గిన లోపాలు అనేకం నా గ్రంథంలో కన పడ్డాయి. యివి కార్మిక వర్గానికి వ్యతిరేకంగా సాగుతున్న విప్లవ ప్రతీఘాత మోసానికీ, తద్వారా బూర్జువావర్గానికీ సహాయ పడటా నికి తోడ్పడినవన్న విషయం (రచయిత అభీష్టం ఏమైనప్పటికి) కాదన టానికి వీలు లేదు. నాకృషిలో నిండుకున్న సంస్కరణ తత్వస్వభావంగల్గిన లోపాలు ప్రస్తుత సమయంలో ఒక్క పెట్టుబడిదారీ దేశాలలోని శ్రామిక జనసామాన్యానికి మాత్రమే కాక, నూతన ప్రజాతంత్ర దేశాల ప్రజానీకానికికూడ ప్రత్యేకంగా అత్యంత ప్రమాదకరమైనట్టివి. విప్లవకర కమ్యూనిస్టు లుగా తయారుకావాలని నిజాయితీతోనూ చిత్తశుద్ధితోను అభిలషించి, యీ దేశాల లోని వేలాది సోషల్ డెమాక్రటిక్ కార్య కర్తలు, వందలాది అతివాద సోషల్

డెమాక్రేట్ నాయకులు కమ్యూనిస్టు పార్టీలో వ్యక్తిగతంగా చేరటం, సమష్టిగా కమ్యూనిస్టుపార్టీలలో లీనంఅయిపోవటం జరిగింది. కాని వీరు యింతకాలంగా సంస్కరణతత్వ సిద్ధాంతాలతో శిక్షణ పొందుతూవచ్చారు. కాన ఆసిద్ధాంతాల బారినుండి పూర్తిగా విముక్తిచెంది మార్క్సిస్టు - లెనినిస్టు సిద్ధాంతాల పునః శిక్షణ పొందాల్సివుంది. కొన్ని తరాల పాటు సంస్కరణతత్వ సిద్ధాంతాల శిక్షణపొందిన వీరికి యీ పని చాలా జటిలంగా ఉంటుంది. సంస్కరణతత్వం రివిజనిజం యొక్క ప్రమాదం యిక్కడే ఉంది. సంస్కరణతత్వ సిద్ధాంతాలకు వ్యతిరేకంగా సాగుతున్న సంఘర్షణలో, సోవియట్ యూనియన్ విజ్ఞానశాస్త్ర రంగంలో పనిచేసే కార్యకర్తలనుంచి సాయం మన సోదర పార్టీలకు కావాలి. ఆ విధంగా ఆ పార్టీలు ఆశిస్తున్నవి. అందువల్ల మన కృషిలో సంస్కరణతత్వ పోకడలు ప్రవేశించినట్లయితే (నా విషయంలో జరిగినట్లు) మన సోదర పార్టీలకు మనం ఎటువంటి సహాయాన్ని చేయక పోగా, వారియొక్క ప్రాముఖ్యమైన కృషిని నిన్నటిదాకా సోషల్ డెమాక్రెట్లుగా వుండి కొత్తగా పార్టీలో చేరిన సభ్యులకు పునఃశిక్షణ గరపటాన్ని మనం దెబ్బతీసినట్లవుతుంది.

ఈ విషయాన్ని మరొక్క సారి నొక్కి చెప్పాలనుకొంటున్నాను: సంస్కరణ తత్వాన్ని బాహాటంగా ప్రచారంచేసే గ్రంథాలు ఈ సందర్భంలో చాలా తక్కువ హానినిమాత్రం చేయగల్గుతాయి. ఎందుకంటే వాటి ఉద్దేశాలను తూర్పార పట్టడం చాలా తేలిక. కాని నా గ్రంథం విషయంలో మాత్రం అలా కాదు. సంస్కరణతత్వ స్వభావం గల్గినలోపాలు ముసుగులో ఎంతో కొంత దాగొని వుంటాయి. అందువల్ల ఆ ముసుగును తొలగించి, వాటిని సరిదిద్దటం కష్టతరమౌతుంది. *

ప్రస్తుతంలోగాని, నిన్న మొన్నదాకా గాని బూర్జువా రాజ్యాంగయంత్రంయొక్క పాత్ర ఏమిటి అని ఆకళింపు చేసుకోవటంలో అనేక సమస్యలు తలెత్తుతాయి. ఈ సమస్యలన్నింటినిగూర్చి వివరిస్తూ, నా గ్రంథంపై వచ్చిన విమర్శవుంది. కాబట్టి, యీ విమర్శ ఎంతో ప్రధానమైనది. నా గ్రంథంలోని లోపాలు యీ సమస్యలకు సంబంధించినట్టివే. బూర్జువా రాజ్యాంగ యంత్ర స్వభావాన్ని నిర్ధారణచేయటంలో విప్లవకర మార్క్సిస్టు - బోల్షివిక్‌లకు విప్లవ ప్రతిఘాత సంస్కరణవాదులకుగల భేదం, మూలభేదాలలో ఒకటిగా గత అర్ధ శతాబ్దంపైగా పరిగణించబడుతూ వుండటము సువిదితమే. మార్క్స్-ఎంగిల్స్‌లు ఎల్లప్పుడూ, ప్రతిచోట ఈ విషయాన్ని గూర్చినొక్కి చెప్పుతూనేవచ్చారు: "క్రిటిక్ ఆఫ్‌ది గోథాప్రోగ్రామ్"; పారిస్ కమ్యూన్‌నుగూర్చి తాము యిచ్చిన విపులీకరణ, 'కుటుంబం, వ్యక్తిగత ఆస్తి, రాజ్యాంగ యంత్రాలపుట్టుపూర్వోత్తరాలు'; 'డూహ్రింగ్ ఖండన'; వీటన్నిటిలోను, తర్వాత వారిద్దరమధ్య జరిగిన వుత్తరప్రత్యుత్తరాలలోను బూర్జువా రాజ్యాంగయంత్రము

* ఇక్కడ ఒక విషయం ప్రస్తావించాలి. నా గ్రంథానువాదం హంగేరియన్ భాషలో ప్రచురించిన తర్వాత, హంగేరియన్ వర్కర్సుపార్టీ కేంద్ర సిద్ధాంతపత్రికలో నా పుస్తకంపై విమర్శ అచ్చయింది. ఆ విమర్శలో ప్రధాన విషయాలు మనపార్టీ పత్రికల్లో అచ్చయిన విమర్శల్లోని విషయాలతో ఏకీభవించాయి.

యొక్క స్వభావాన్ని - పెట్టుబడిదార్లు తమవర్గ పెత్తనాన్ని సురక్షించుకోవటం కోసం, శ్రామికజనసామాన్యాన్ని అణగ త్రొక్కటంకోసమూ రాజ్యాంగ యంత్రాన్ని ఒక ఆయుధంగా వుపయోగించుకుంటారని - పదేపదే నొక్కి చెప్పారు. రాజ్యాంగయంత్రంపై మార్క్స్ ఎంగిల్స్‌లయొక్క యీ ఉపదేశాలను సంస్కరణవాదులు మరుగుపరుచుతారు వీటినిగూర్చి పల్లెత్తు మాట్లాడరు. పైగా వీటికి మసిబూసి మారేడుకాయ చేయాలని ప్రయత్నిస్తారు.

లెనిన్ అనేక అత్యుత్తమ గ్రంధాలను, సమరశీల గ్రంథాలను రచించాడు. అందులో ఒక గ్రంధం, "రాజ్యాంగ యంత్రం: విప్లవం" అన్నది. సంస్కరణ వాదానికి వ్యతిరేక పోరాటం కోసం ఈ గ్రంధాన్ని ప్రత్యేకించాడు. పీఠికలో అతనిలా రాస్తున్నాడు:

"మొట్టమొదటమనమంతా రాజ్యాంగ యంత్రాన్నిగూర్చి మార్క్స్ - ఏంగిల్స్‌ల యొక్క డాక్ట్రియిన్‌ను పరిశీలిస్తాం. తర్వాత వారియొక్క డాక్ట్రియిన్‌లో వున్న ఏఏ విషయాలకు తిలోదకాలు యివ్వబడ్డాయో, లేక అవకాశవాదాన్ని పురస్కరించుకొని మసిబూసి మారేడు కాయ చేయటం జరిగిందో ప్రత్యేకంగా, వివరంగా చర్చిస్తాం" (సెలెక్టెడ్ వర్క్స్, రెండు సంపుటాల ఎడిషన్ పేజీ 142)

మార్క్స్ - ఏంగిల్స్‌లయొక్క బహుళ మైన ప్రవచనాలతో ప్రారంభించి లెనిన్ స్టాలిన్‌లు రాజ్యాంగయంత్రాన్ని గూర్చి తమ ఉపదేశాలను విస్తృత పర్చారు. సామ్రాజ్యవాదదశలో, సామ్రాజ్యవాద దేశాలలోని ఆర్థిక పెత్తందార్లు (ఫైనాన్షియల్ ఆలిగార్కీ) రాజ్యాంగయంత్రాన్ని శ్రామిక ప్రజానీకాన్ని కొల్లగొట్టేందుకు ఒకసాధనగా వుపయోగిస్తారని వీరుప్రత్యేకంగా నొక్కి చెప్పారు.

రాజ్యాంగయంత్రాన్నిగూర్చి లెనిన్, స్టాలిన్‌లు విస్తృతపర్చిన, సరైన ఒకే ఒక ఈ సిద్ధాంతం మార్క్సిస్టుల కందరికు తెలిసినదే. అయినప్పుడు దీనికి ప్రత్యామ్నాయంగా యుద్ధకాల ఆర్థికవిధానంలో రాజ్యాంగయంత్రం యొక్క పాత్రను గూర్చి సంస్కరణతత్వంగల లోపాల ప్రవాహం నాగ్రంధంలోకి దొర్లటం ఎలా సంభవించింది?

నా యొక్క విమర్శకులు సరిగా వివరపర్చినట్లు ఈ లోపాలన్నింటికీ మూలాధారం ఎక్కడ వుందంటే రాజకీయాల నుంచి ఆర్థిక విషయాలను తప్పుగా వేరు చేసే పధాన క్రమంలోవుంది. పెట్టుబడిదారీ ఆర్థిక విధానంలో వచ్చిన మార్పులను రాజకీయాలకు సంబంధం లేకుండా 'శుద్ధ ఆర్థిక విషయాలుగా' చిత్రించ ప్రయత్నించటంలో వుంది.

ఈ విధంగా మార్క్సిస్టు - లెనినిస్టు గతి తార్కిక పద్ధతినుంచి వేరవటం జరిగింది. మార్క్సిస్టు - లెనినిస్టు పద్ధతి ప్రతిదానిని అన్ని దృక్కోణాలనుంచి చూస్తూ పూర్వాపరాలకుగల సంబంధాలను అర్థం చేసుకొనేటట్లు చేస్తుంది. ఇట్టి పద్ధతికి తిలోదకాలు యివ్వబట్టే సంస్కరణ స్వభావం గల్గిన లోపాలను చేయటానికి తప్పనిసరిగా దారితీసింది.

ఆర్థిక శాస్త్రమంటే వర్గాల మధ్యవున్న సంబంధాలే. ప్రతి వర్గసహిత సమాజంలోనూ, రాజకీయాల యొక్క ప్రధాన స్వరూపమే వర్గసంఘర్షణ. ఆర్థిక విషయాల కేంద్రీకరణమే రాజకీయాలు.

"రాజకీయాలనుంచి దూరంచేసి" పెట్టుబడిదారీ ఆర్థిక విషయాలను వివరించ పూనుకున్నట్లయితే పాత వరల్డ్ ఎకానమీ -వరల్డ్ పాలిటిక్స్ పాత సంస్థలో పని చేసిన నేను నాతోపాటు యితరులు పూనుకున్నట్లు - మార్క్సిస్టు - లెనినిస్టు పద్ధతినుంచి వేరైన కారణంగా - గ్రంథ కర్త వాంఛలకు వ్యతిరేకంగా-సంస్కరణ స్వభావం గల్గిన లోపాలకు దారితీయక తప్పదు.

తప్పుడు పద్ధతిలో రాజకీయాలను వేరు చేయటంవల్ల వర్గసంబంధాలు సంఘర్షణను గూర్చిన పరిశీలన తప్పని సరిగా తప్పుడు పర్యవసానానికి దారితీసింది. యుద్ధ ఆర్థిక విధానంలో రాజ్యాంగ యంత్రం స్థానమేమిటో తప్పుగా నిర్ధారణ చేయటం జరిగింది. అందువల్లనే "యుద్ధకాలపు ఆర్థిక విధానంలో రాజ్యాంగ యంత్రంయొక్క అటోయిటో తేల్చేపాత్ర" అంటూ లోపభూయిష్టమైన దబాయింపుకు దారితీసింది. యుద్ధకాలపు పెట్టుబడిదారీ ఆర్థిక విధానంలో రాజ్యాంగ యంత్రం యొక్క పాత్రను "శుద్ధ ఆర్థిక దృష్టితో" పరిశీలించినట్లయితే - నేను యీ తప్పుడు దృష్టితో చేసినట్లు - మనం తప్పని సరిగా తప్పుడు నిర్ణయానికి వస్తాం. "రాజ్యాంగయంత్రాన్ని"వర్గ దృష్టి పథాన్నుంచి విశదీకరించకపోయినప్పుడు ఆర్థిక పెత్తందార్లు అత్యంత ప్రధానమైన పాత్రను వహించరనే తప్పుడు అభిప్రాయానికి తావువచ్చింది. మార్క్సిస్టు లెనినిస్టు వర్గ విశదీకరణస్థానే 'శుద్ధఆర్థిక' పరిశీలనంటూ ఒక దానిని ప్రవేశపెట్టాను. విషయాన్ని యీ విధంగా బాహ్యస్థితినే చూడటం మూలకంగా వ్యక్తిగత గుత్త వ్యాపారుల ప్రయోజనాలకు వ్యతిరిక్తంగా యుద్ధాన్ని సాగించే ప్రయోజనాల నుద్దేశించి రాజ్యాంగ యంత్రం పనిచేస్తుందనే తప్పుడు అభిప్రాయానికి వచ్చాను.

బూర్జువా రాజ్యాంగ యంత్రాన్ని గూర్చి నా గ్రంథంలో యిలా రాసాను.

"యుద్ధావసరాలకోసం దేశంయొక్క సాధన సంపత్తినంతా సాధ్యమైనంత బహుళంగా ఉపయోగించాలని అది అభిలషిస్తుంది. కాని వివిధ పెట్టుబడిదారీ సంస్థలు సాధ్యమైనంత అత్యధిక లాభాలను గుంజుకోవాలనే స్వార్థపరత్వం వల్లనూ, వాటియొక్క మరికొన్ని ప్రయోజనాలవల్లనూ, యీ పెట్టుబడిదారీ సంస్థలతో అది (రాజ్యాంగ యంత్రం - అనువాదకుడు) నిశ్చయంగా సంఘర్షణలో పడుతుంది" (10వ పేజీ)

బూర్జువా రాజ్యాంగ యంత్రంయొక్క స్వభావం వర్గాతీతంగావుంటుందన్న విషయాన్ని గుర్తించటానికి యీ పై ప్రకటన అవకాశాన్ని కలుగచేస్తోందని యీ చర్చలలో పాల్గొన్నవారు ఎంతో సబబుగా యిది ఎత్తిచూపారు.

బూర్జువారాజ్యాంగ యంత్రంయొక్క వర్గస్వభావాన్ని నేను తిరస్కరిస్తున్నాననటం సత్యదూరమని వేరే ప్రత్యేకించి చెప్పనవసరంలేదు. కాని సమకాలీన రాజ్యాంగయంత్రాన్ని "బూర్జువావర్గం అంతటియొక్క సంస్థ" అని చిత్రించటం ద్వారా నేను తప్పుచేసాననటంలో సందేహంలేదు. రాజ్యాంగయంత్రం ఆర్థిక పెత్తందార్లయొక్క సంస్థఅని చెప్పివుండాల్సింది.

వాస్తవిక విషయాలు వాటంతటఅవే సక్రమ మార్గాన్ని చూపిస్తున్నప్పటికీ, తప్పుడుపద్ధతిని అవలంబించటంవల్ల సంస్కరణ తత్వ స్వభావంగల లోపాలను దారి

తీసింది. అమెరికా, ఇంగ్లండు దేశాలలో యుద్ధార్థిక విధానంయొక్క శాఖలన్నింటా ఉన్నతస్థానాలను పెద్ద పెద్ద గుత్తవ్యాపార సంస్థల ప్రతినిధులు ఆక్రమించుకున్నారని (పేజీ 30-31) నేను సరిగానే యెత్తి చూపెట్టాను. అందులో యిలావుంది:

"యుద్ధంకాలంలోని ఆర్థికవిధానంలో కూడ అత్యంత ప్రధానమైన తమ ప్రాబల్యాన్ని సాధారణంగా పెద్దపెద్ద గుత్త వ్యాపార సంస్థలు నిలబెట్టుకున్నాయి. యుద్ధకాలపు ఆర్థికసంస్థల కార్యకలాపాలకు నాయకత్వం వహించటంతో ఇవి చాలా ప్రధానమైనపాత్రను వహించటమే కాక, వాస్తవంగా ఆ కార్యకలాపాలను స్వయంగా నడిపాయి". (37 వ పేజీ)

సరియైన ఆధారాలు కల యదార్థవిషయాలు సైతం, మార్క్సిస్టు-లెనినిస్టుపద్ధతిని అనువర్తించిచూడనప్పుడు, గతితార్కికపరస్పర చర్య (డైలెక్టికల్ ఇంటర్ యాక్షన్) నుండి వేరైనప్పుడు, వాటిని సిద్ధాంత రీత్యా సాధారణతత్వీకరణ (జనరలైజ్ డ్) చేయనప్పుడు, శాస్త్ర పరిశోధనదృష్టి నుండి అవి అతిప్రాముఖ్యమైనవిగా మారతాయి. యుద్ధకాలంతో ఆర్థిక పెత్తందార్లు రాజ్యాంగయంత్రంలోకి యింకా ఎక్కువగాచొచ్చుకిపోయి, తమస్థానాన్ని పదిలపర్చుకొంటారన్న దానికి,మార్క్సిస్టు, లెనినిస్టు సిద్ధాంతాన్ని ఆధారంగా చేసుకొని,పై వాస్తవిక విషయాలు, అటువంటి మరికొన్నిటినికలిపి ఋజువుచేసి చూపెట్టాల్సింది. ఈ విధంగా తమస్థానాన్ని పదిపర్చుకోవటంవల్ల యుద్ధకాలంలోను,శాంతి సమయంలోను కూడ గుత్తవ్యాపారస్థుల అత్యధికలాభాలకు హామీ యివ్వడమైంది.

రాజ్యాంగయంత్రంయొక్క సమస్యను గూర్చి నా గ్రంథంలోని అనేక ముఖ్యమైన సంస్కరణతత్వ లోపాలను విమర్శకులు సరిగా ఎత్తిచూపారు. 318 వ పేజీలో యిలా వుంది.

"యుద్ధ పూర్వం కన్నా 'రాజ్యాంగయంత్రంయొక్క పాత్ర భవిష్యత్తులో' యింకా అధిక ప్రాముఖ్యాన్ను కలిగి వుంటుంది. రాజ్యాంగయంత్రం తరఫు పాలులోని హెచ్చుతగ్గుల సమస్య, పెట్టుబడిదారీ సమాజంలోని రెండు ప్రధానవర్గాల - బూర్జువావర్గం, కార్మికవర్గం - మధ్య జరిగే సంఘర్షణరూపాన్నిబట్టి ఏర్పడుతుంది. కార్మికవర్గంయొక్క బలం అభివృద్ధి చెందేకొలదీ బూర్జువా సమాజంలో అంతర్గతశక్తులు తీవ్రంగా ఘర్షిస్తాయి. ఆ సమాజం రెండు ప్రధాన విభిన్నవర్గాలుగా చీలిపోతుంది."

ఈ వాక్యాలను ఏ సంస్కరణవాది అయినప్పటికీ ఆమోదిస్తాడు. యుద్ధానంతరం, వెంటనే 1946 సంIIలో, యూరప్ ఖండంలోని అత్యధిక దేశాలలో - నూతన ప్రజాస్వామిక దేశాలలోనే కాక ఫ్రాన్సు, ఇటలీ, ఫిన్లెండు యిత్యాదిదేశాలలోకూడ కమ్యూనిస్టులు ప్రభుత్వాలలో పాలు పంచుకున్నారు. ఈ వాస్తవిక విషయ ప్రాబల్యానికి లోనయి పై వాక్యాలు రాయటం జరిగింది. ఫాసిస్టు ఆక్రమణదారులకు వ్యతిరేకంగా సాగిన ప్రతిఘటనా పోరాటానికి జీవం కమ్యూనిస్టులే కనుక, ప్రజలలో వారికున్న పేరు ప్రతిష్టలను ఉపయోగించుకొని ప్రభుత్వాలలో వారికున్న స్థానాలను నిలబెట్టుకుంటారనీ; నాటిని యింకా విస్తృతపర్చుకుంటారనీ, తద్వారా బూర్జువావర్గ వ్యతిరేక పోరాటంలో రాజ్యాంగయంత్రాన్ని చేపట్టుతారనిఆశిస్తూ పైవాక్యాలు రాయటంజరిగింది.

రాజ్యాంగయంత్రం బూర్జువావర్గానిదిగానే వుందనీ, దానియంత్రశక్తిఅంతా (సైన్యం, పోలీసు, రక్షకభటులు) యధాతథంగానే వుందనే ప్రధానవిషయాన్ని వైరీతిలో ఆలోచించటంవల్ల పరిగణించనే లేదు. ఎప్పుడైతే కమ్యూనిస్టులు పెట్టుబడిదారీ రాజ్యాంగయంత్రి ప్రభుత్వాలలో పాలుపంచుకుంటూ బూర్జువా వర్గానికి వ్యతిరేకంగా కార్మికవర్గ ప్రయోజనాలను రక్షించటంకోసం రాజ్యాంగ యంత్రంయొక్క వర్గస్వభావాన్ని మార్చటంకోసం - పిడికిలిబిగించి ప్రయత్నించసాగారో అప్పుడే వారిని బూర్జువా ప్రభుత్వాలనుంచి బయటికి సాగనంపారు. శ్రామికజనసామాన్యంలో పూర్తి సహకారాన్ని కమ్యూనిస్టులు పొందుతున్నప్పటికీ ఈవిధంగా ప్రభుత్వాలనుంచి బహిష్కరించటం సాధ్యపడింది. ఇటువంటి పోరాటాలే భవిష్యత్తులో వస్తవనే భయంకొద్దీ, ఆంగ్లో-అమెరికన్ ఆక్రమణ సైన్యాలు ఫ్రాన్సు, ఇటలీ మొదలైన దేశాలలో కమ్యూనిస్టుల ఆధిపత్యాన సాగుతున్న ప్రతిఘటనోద్యమాన్ని నిరాయుధం చేసాయి. కమ్యూనిస్టులకు వ్యతిరేకంగా అభివృద్ధినిరోధకులను బలపర్చుతూ ప్రజలయొక్క పోరాట ఐక్యతను విచ్ఛిన్నపర్చాయి.

నూతన ప్రజాస్వామిక దేశాలలో సరిగా దీనికి వ్యతిరేకంగా జరిగింది. ఈ దేశాలలో శ్రామికప్రజలు సోవియట్ యూనియన్ అండతో తమ ఆయుధాలను తమ చేంతనే వుంచుకున్నారు. రాజ్యాంగయంత్రంపై అధికారాన్ని హస్తగతం చేసుకున్నారు. ధనాఢ్య వర్గాల ప్రతినిధులను ప్రభుత్వాలలోనుంచి వెడలగొట్టారు. వారికి ప్రజలలో ఎటువంటి బలం లేకుండా చేయబడింది. రాజ్యాంగయంత్రాన్నిగూర్చి చెప్పబడిన మార్క్సిస్టు, లెనినిస్టు ఉపదేశాల ప్రాశస్త్యానికి యుద్ధానంతరం యూరప్‌లో జరిగిన ఘటనలు నూతనంగా లభ్యమయే గీటురాళ్ళు. రాజ్యాంగ యంత్రంయొక్క అధికార సమస్య వర్గశక్తులకు సంబంధించినసమస్య. ఒక్క వర్గపోరాటంద్వారానే ఈసమస్య పరిష్కార మవుతుందన్న విషయాన్ని ప్రతిఘటనలు ఋజువుచేస్తున్నాయి.

1947 లో జరిగిన అక్టోబరు సోషలిస్టు మహావిప్లవంయొక్క 30 వ వార్షికోత్సవ సందర్భంలో నేను రాసిన వ్యాసాలలో కూడ సంస్కరణతత్వ స్వభావంగల లోపాలు దురదృష్టవశాత్తు ప్రత్యక్షమయాయి.

ఆ వ్యాసం యిలా చెప్తుతోంది:

"యూరప్‌ఖండం పెట్టుబడిదారీ విధానానికి జన్మస్థానం. అట్టి యూరప్‌ఖండంలోని బూర్జువావర్గమే యిప్పుడు తనంతటతానే పెట్టుబడిదారీ సామాజికవ్యవస్థ మూలంలోనే రావాల్సిన సంస్కరణ ఆవశ్యకతను గుర్తిస్తున్నది. ప్రధానమైన ఉత్పత్తి శాఖలను జాతిపరం చేయటం, ఆర్థికవిధానంపై రాజ్యాంగ యంత్రానికి అధికారం అప్పగించటం, 'క్రమబద్ధమైన ఆర్థికవిధానం' మున్నగు చర్యలను తీసుకోక తప్పదని గుర్తిస్తున్నది......"

ఈ సిద్ధాంతం పట్టి శుద్ధ తప్పులతడిక. కార్మికులను మోసగించేందుకు, కమ్యూనిస్టు పార్టీలకు కమ్యూనిజానికి, వ్యతిరేకంగా జరిగే పోరాటంలో బూర్జువావర్గానికి సాయపడేందుకు బూర్జువావర్గంలో ఒక భాగము, దాని తొత్తులు - అమాంబాపతు సంస్కరణవాదులు - ఇదే విషయాన్ని వల్లిస్తున్నారు. యూరప్ పెట్టు

బడేవార్లలోని తెలివిగల రకమూ, ప్రత్యేకంగా వారి తొత్తులైన సంస్కరణవాదులూ సామ్యవాదం వైపుకు సాగే పురోగమనానికి పెట్టుబడిదారీ విధానంలో "మూల సంస్కరణలు" తప్పనిసరి అవుతాయనే మాటల్తో గొంతు చించుకుంటున్నారు. దీనిని అర్థం చేసుకోవటం చాలా తేలికైన విషయం. పెట్టుబడిదారీ ఆర్థిక విధానం యూరప్ ఖండాన్ని ఒకతరంలోనే రెండు యుద్ధాలకు ఎరచేసింది. దీనివల్ల లక్షలాది శ్రామిక ప్రజలు ఆహుతి అయిపోయారు. లక్షలాది ప్రజలు అంధులుగాను, వికలాంగులుగాను, తల్లిదండ్రులు లేని అనాథులుగాను తయారయారు. ఆకలికీ అంటువ్యాధులకూ ఈయుద్ధాలు దారితీసాయి. కాని యిదే సమయంలో యుద్ధ కాంట్రాక్టర్లు విపరీతంగా ధనాన్ని ఆర్జించుకొన్నారు. దీనికి తోడు ఈ యుద్ధం పుణ్యమాఅంటూ ఫాసిస్టు పశుత్వం, కాన్‌సెన్‌ట్రేషన్ క్యాంపులు, జాతి విద్వేషం ద్వారా లక్షలాది అమాయక ప్రజలను బలికావించటం జరిగింది. ఈ సామాజికవ్యవస్థ మరణశయ్యపై నున్నదనే విషయాన్ని ప్రజానీకం నిత్యానుభవం ద్వారా తెలుసుకుంటోంది. ఈ వ్యవస్థ పైనుంచి కిందదాకా కుళ్ళి, కంపుకొడుతోందని తేటతెల్లమవుతోంది. ఇది నిర్మూలన కావటం చారిత్రకంగా తథ్యమని తెలుసుకుంటున్నాము. ప్రజలకు యిది తెచ్చిపెట్టిందల్లా నిరుద్యోగం, ఉత్పత్తిశక్తులను శాశ్వతంగా నిరుపయోగం చేయటమూను. గ్రంథాంతములో నేను ఈ క్రిందివిధంగా సూత్రీకరించాను :

"ఈ విచిత్రసత్యం ఎప్పటిలాగానే మిగిలిపోయింది. గత పాతిక సంవత్సరాల కాలమంతటిలోనూ ఒక్క యుద్ధసమయంలో మాత్రమే పెట్టుబడిదారీ దేశంలో పని కావాలని పరితపించేవారికి నిజంగా పని దొరికింది. లక్షలాది ప్రజలు ఒకరి గొంతుకలను మరొకరు కోస్తూవుంటే, యీ వూచకోతకు మరికొన్ని లక్షలమంది ప్రజలు ఆయుధాలుతయారుచేస్తూవుంటేనే గాని పెట్టుబడిదారీ సమాజం కార్మికుల కందరికీ పని చూపెట్టే స్థితిలోలేదు."

"ఇంకొక సత్యంకూడ యథాతథంగా నిలచివుంది. గత పాతిక సంవత్సరాల కాలంలోనూ పెట్టుబడిదారీ ప్రపంచములోని ఉత్పత్తిసాధనాలను సాధ్యమైనంతి ఎక్కువగా ఉపయోగించుకున్నాయి. అయినా మానవజాతినమ్మశక్యంగానిబాధలకు, కష్టాలకు గురయింది." (319 పేజీ)

ఈ పరిస్థితులతో ఏ పెట్టుబడిదారుడుగానీ, లేక పెట్టుబడిదారీ విధానాల్ని సమర్థించేవాడుగానీ శ్రామికులచే ఇంతగా ద్వేషించబడుతున్న సామాజిక వ్యవస్థను యథాతథంగా వుంచాలని రొమ్ము విరుచుకొంటూ ముందుకురావటం అరుదని వేరే చెప్పనవసరంలేదు. ఆ విధంగా చెప్పటం వల్ల కార్మికులను మరింత తొందరగా కమ్యూనిజంయొక్క అవగింజలోకి దారితీయటమే అవుతుంది. అందువల్ల మాటలలో ప్రధాన మార్పులని వల్లిస్తూ ఆచరణలో పెట్టుబడిదారీ దోపిడిపై ఆధారపడివున్న వ్యవస్థను యథాతథంగా నిలబెట్టటంకోసం అన్నివిధాలా ప్రయత్నిస్తున్నారు. *

* ఈవిషయంలో ఫాసిస్టులనుగూడ ప్రస్తావించటం మంచిదనుకొంటున్నాను. ఫాసిస్టులుగూడ వాచా 'పెట్టుబడిదారీ వ్యతిరేక' పదజాలం వాడినవారే. 'జర్మన్ సోషలిజం'అంటూ వట్టిచెత్త వాగారు. సాధారణంగా యీ రోజుల్లో ఫాసిస్టుల నుంచి సంస్కరణవాదులను (ఉ|| జూల్ మాక్) వేరుచేయుటం చాలా కష్టం.

ఇదంతా నా గ్రంధంలో చెప్పక పోవటం నిస్సందేహంగా ఒక పెద్దలోపం, పైగా సంస్కరణవాదానికి తోడ్పడటం. "రాజ్యాంగయంత్రం: విప్లవం" అన్న గ్రంధానికి పీఠిక వ్రాస్తూ లెనిన్ యీ విధంగా హెచ్చరించాడు:

"ముందు రాజ్యాంగయంత్రాన్ని గూర్చి వున్న అవకాశవాద భ్రమలకు వ్యతిరేకంగా పోరాటం సల్పకుండా బూర్జువావర్గం ప్రభావంనుంచి, ముఖ్యంగా సామ్రాజ్యవాద బూర్జువావర్గ ప్రభావంనుంచి ప్రజానీకాన్ని విముక్తి చేయటంకోసం జరిగే పోరాటం అసంభవమౌతుంది." (సెలెక్టెడ్ వర్క్సు, టువాల్యూమ్ ఎడిషన్ 151 వ పేజీ)

ఇంగ్లండులో సాగించబడిన నేషనలైజేషన్‌ను గూర్చి నేనిచ్చిన తప్పుడు చిత్రణకూడ యిట్టి దుష్ఫలితాలకే తావిచ్చింది. ఆర్థికవిధానం యొక్క ముఖ్యమైన శాఖలను జాతిపరం చేయటంవల్ల స్టేట్ క్యాపిటలిజం యింకా బలిష్టమొనర్చబడుతుందని వేరే చెప్పాల్సిన అవసరంలేదు. అందువల్ల "బూర్జువావర్గ మార్గంలో జాతిపరంచేయటంకూడ ఒక కొత్తరకమైన ప్రజాస్వామికంవైపుకు పురోగమించడాన్ని సూచిస్తోంద"ని రాయటం సరియైనది కాదు. (వరల్డ్ ఎకానిమీ వరల్డ్ పాలిటిక్సు నెం. 3. 1947; 8 వ పేజీ)

ఇక్కడకూడ పై లోపమే ప్రత్యక్షమైంది. బ్రిటిషు రాజ్యాంగ యంత్రానికి ఆధిపత్యం వహిస్తూన్న లేబర్ ప్రభుత్వం స్వభావానికే ప్రజల ప్రజాస్వామిక దేశాలలోని ప్రభుత్వాల స్వభావానికిగల ప్రధానమైన తారతమ్యాన్ని అలక్ష్యం చేయటం జరిగింది. లేబరువాదులు అధికారంలోవున్న బ్రిటిషురాజ్యాంగయంత్రం బూర్జువావర్గ రాజ్యాంగయంత్రం, గుత్తపెట్టుబడుల రాజ్యాంగయంత్రం. దీని ప్రధానోద్దేశం బడాబూర్జువా వర్గంయొక్క వర్గపెత్తనాన్ని గ్యారంటీచేయటం. అప్పుడప్పుడు ఏషిస్వెల్లో, లాస్కీయో కార్మికులకు సంస్కరణవాదుల కూటమిలో బందీలుగా వుంచటంకోసం పదాడంబర ఉపన్యాసాలు చేసేందుకు అధికారం పొందారనటం వాస్తవం. కాని రాజ్యాంగ యంత్రం యొక్క శక్తిని - సైన్యాన్ని - బూర్జువావర్గంయొక్క నమ్మినబంటుల చేతుల్లో నేవుంచి శ్రామిక జనసామాన్యాన్ని అణచటంకోసం ప్రయోగిస్తున్నారు. తమకు వచ్చే అత్యధిక గుత్త లాభాలనుండి స్వల్పభాగాన్ని బూర్జువావర్గం లేబర్ భోగలాలసులకు ముష్టిగా పారేస్తుంది. లేబర్ నిరంకుశవాదుల ప్రభుత్వంలో పెద్దపెద్ద వేతనాలు పొందే ఉద్యోగులను కొనేస్తుంది *

వారిలో కొందరిమీద సాగిన విచారణలో బయటపడినట్లుచిన్న చిన్న మొత్తాలు

* ఇదే రకమైన పరిస్థితి అమెరికాలోకూడ కనపడుతోంది. పెద్ద పెట్టుబడిదార్ల పత్రిక అయిన 'న్యూయార్కర్ జీటుంగ్' (1949 జనవరి 21) సంచికలో 'కొత్త ప్రపంచం' అనే శీర్షిక క్రింద ఒక వార్తా విశేషం ప్రకటించబడింది.

"గత సంవత్సరమంతా వాషింగ్టన్‌లోని వైట్‌హౌస్ అభిజ్ఞవర్గాలలోను, మంత్రుల సన్మాన సమయాల్లోను, మనం విశేషించి ఒకకొత్తరకమైన వ్యక్తిని కలుసుకున్నాం అతనే ట్రేడ్‌యూనియన్ నాయకుడు. చూపులకు యితను మామూలు అమెరికన్ వ్యాపారస్థునికి ఏ మాత్రంతీసిపోడు.

లంచంగా యిస్తుంది. ఇదంతా బ్రిటిషు బూర్జువావర్గం కాచిపడపోసి మరీ అవలంబించే పంథాను తెలియచేస్తోంది.

"న్యూస్టేట్స్మన్ అండ్ నేషన్" అనే 'అతివాద' వారపత్రిక (ఫిబ్రవరి 28, 1948) రాసిన వాక్యాలలో లేబర్ ప్రభుత్వ కార్యకలాపాలయెడ బ్రిటిష్ పెద్దవ్యాపారస్థులు ఎంతగా సంతృప్తి చెందారో బయల్పడుతోంది.

"ఈమధ్య ఒక పెద్ద పారిశ్రామికుడు రాజకీయ పరిస్థితిపై వ్యాఖ్యానం చేస్తూ యిలా అన్నాడు: 'యుద్ధానంతరం మనకు అనేక కష్టాలు వాటిల్లినమాట నిజమేననుకోండి. కాని యిప్పుడు కార్మికులు చక్కగా పనిచేస్తున్నారు. ప్రతి పని సాఫీగా సాగిపోతోంది. నేనొక కరుడుగట్టిన కన్సర్వేటివ్‌నని, యిలాగే ఎల్లప్పుడూ కన్సర్వేటివ్‌గానే వుంటాననే విషయం మరచిపోకండి. కాని కన్సర్వేటివ్ లే ఇప్పుడు అధికారంలోకి వచ్చివుంటే ఏమి జరిగివుండేదో వూహించటానికికూడ నాకుమహా భయంగా వుంది.' (వత్తిడి వార్గాది)

ప్రజల ప్రజాస్వామిక దేశాలలోని రాజ్యాంగయంత్రం దీనికి పూర్తిగా విరుద్ధమైనట్టిది. శ్రామిక ప్రజల ప్రయోజనాల కోసం, దోపిడీవర్గాలకు వ్యతిరేకంగా కార్మికవర్గ నియంతృత్వపు విధులను నెరవేర్చే శ్రామిక ప్రజల రాజ్యాంగయంత్రం అది. ఈ దేశాలలో సైన్యం, రాజ్యాంగయంత్రశక్తి యావత్తూ శ్రామిక ప్రజలకు నమ్మకస్తులైనవారి చేతుల్లో వున్నాయి. దోపిడిదారులకు వ్యతిరేకంగా ప్రయోగించబడుతున్నాయి.

ఇంగ్లండు రాజ్యాంగయంత్రంయొక్క స్వభావాన్నిబట్టి అక్కడ జాతిపరం చేయటం "ఒక కొత్తరకమైన ప్రజాస్వామికంవైపు పురోగమనాన్ని" సూచించదు.

---

"ప్రస్తుతం ట్రేడ్‌యూనియన్ నాయకులకు వచ్చే ఆదాయం, మామూలు వ్యాపారస్థునకువచ్చే ఆదాయానికి సుమారు సరిసమానం. ఇదేవిధంగా హుందాతో జీవిస్తున్నారని చెప్పవచ్చు.

"వర్గ పోరాటంఅనే సిద్ధాంతాన్ని వీరు అన్యుల సిద్ధాంతంగా భావిస్తారు. వారు వాస్తవికవాదులు. భూమిపై వున్న వ్యక్తుల్లాగా ఆలోచిస్తారు వారి మనస్సులు మేఘాలలో విహరించవు. వారి ఆలోచనలు ఎప్పుడూ సత్వర సమస్యల పరిష్కారార్థమై పని చేస్తూవుంటాయి. భవిష్యత్తునిగూర్చి కలలుగంటూ కాలాన్ని వ్యర్థబుచ్చరు. తను 'తనయొక్క' పరిశ్రమ సౌభాగ్యానికి, 'తనయొక్క' ఆర్థిక విధానానికి' బాధ్యుడననేభావం ప్రతి అమెరికన్ ట్రేడ్‌యూనియన్ నాయకునిలోను నానాటికిఅభివృద్ధి చెందుతోంది."

ఈ వర్ణనంతా దేనిని తెలియచేస్తోంది? అమెరికాలోని ట్రేడ్‌యూనియన్ నాయకులు కార్మికులనుంచి పూర్తిగా దూరమైపోయి, బూర్జువావర్గంలో లీనమై పోవటాన్ని స్పష్టంగా తెలియచేస్తోంది. మైనర్స్ ట్రేడ్‌యూనియన్ నాయకుడు లూయీ సాలీనా 1,00,000 డాలర్ల వేతనాన్ని పొందుతున్నాడు. అమెరికా అధ్యక్షుడుకూడ మొన్నిమధ్య వరకుయింతకన్నా తక్కువ వేతనం పొందుతూవచ్చాడు.

జాతిపరం చేయబడిన ఆర్థికవిధాన శాఖల పరిపాలనాధిపత్యం నిన్నటిదాకా ఆయా శాఖలకు యజమానులుగా వుంటూ వచ్చిన పెద్ద గుత్తవ్యాపారసంస్థలే యిప్పటికి వహిస్తున్నాయి. జాతిపరం చేయబడ్డ పరిశ్రమలను నష్టపెట్టడం ద్వారా — రాజ్యాంగయంత్రంయొక్క నష్టంపైన— యితర పరిశ్రమల శాఖలలో యింకా జాతిపరం చేయబడని సంస్థలకు కావలసిన చక్కటి సదవకాశాలను ఏర్పరచుకోవటం కోసం వారు మార్గాంతరాలను వెదుకుతున్నారనటంలో సందేహంలేదు. జాతిపరం చేయబడిన సంస్థలయొక్క యజమానులకు విపరీతమైన నష్టపరిహారం చెల్లించటం ద్వారా యింతకాలంగా వస్తున్న ఆదాయం గిట్టుబాటు అవుతోంది. పైగా తీవ్రతరమౌతున్న ఆర్థికసంక్షోభం ఇంగ్లండును యావత్తూ బ్రహ్మాండమైన శక్తితో మొదలంటా వూపివేస్తుంది. ఈ ప్రమాదాన్నుండి వారికి రక్షణ కల్పించబడింది. పన్ను చెల్లించేవారిని-అంటే కార్మికులను-నష్టపెట్టడం ద్వారాను, జాతిపరం చేయబడ్డ శాఖలు పెద్దపెద్ద నష్టాలతో ఉత్పత్తి చేయటంద్వారాను వారియొక్క లాభాలు భద్రంగా వుంటాయి. సంక్షోభంలో అనేక వ్యక్తిగతసంస్థలు దివాళా తీయటానికి యిది దారితీస్తుంది.

రాజ్యాంగ యంత్రాన్ని గూర్చిన మార్క్సిస్టు - లెనినిస్టు ఉపదేశాలను అసంబద్ధంగా అన్వయించటం వల్ల, వలస సమస్యను అర్థం చేసుకోవటంలో అనేక తప్పులకు, తబ్బిబ్బులకు దారి తీసింది. ప్రత్యేకంగా గ్రేట్ బ్రిటన్ - ఇండియాల మధ్య గల సంబంధాలలో వచ్చిన మార్పులను సరిగా అంచనా వేయలేకపోవటం జరిగింది.

బ్రిటన్, భారతదేశ పాలకవర్గాలమధ్య కుదిరిన రాజీఫలితంగా భారతదేశం రెండు అధినివేశ దేశాలుగా విభాగించబడింది. భారతబూర్జువావర్గం, ఫ్యూడల్ భూస్వాములతో సన్నిహితసహకారం నెరపి భారతదేశ జాతీయ విముక్తి ఉద్యమానికి ద్రోహంచేసి, బ్రిటిషు సామ్రాజ్యచట్రంలోనే వుంటూ కోటానుకోట్ల భారత కార్మికులపైన, కర్షకులపైన తమ వర్గాధిపత్యాన్ని నిలబెట్టుకోవటంకోసం రాజీపడింది. పోతే బ్రిటిషు బూర్జువావర్గం తమ ఆక్రమణ సైన్యాలయొక్క ప్రత్యక్ష పరిపాలనకు స్వస్తిచెప్పింది. ఎందుకంటే తమ పెట్టుబడులను రాబట్టుకోనేందుకు, యితర ఆర్థిక ప్రయోజనాలను సాధించుకోనేందుకు, భవిష్యత్తులో భారత కార్మికులనుండి కొల్లగొట్టినదోపిడీలో భాగాన్ని పంచుకోనేందుకు ప్రత్యక్ష పరిపాలనకు స్వస్తి చెప్పారు.

గ్రేట్ బ్రిటన్ భారతదేశాల మధ్యనున్న ఆర్థిక సంబంధాలనుగూర్చి నా గ్రంథంలో తప్పుడు అంచనాలను యిచ్చాను. యిలా రాసాను :

"భారతదేశం బ్రిటన్‌నుంచి అప్పుపుచ్చుకొనే స్థితినుంచి, బ్రిటన్‌కు అప్పుపెట్టే స్థితికి మార్పు చెందింది. యీరెండు దేశాల మధ్యనున్న ఆర్థిక సంబంధాలలో ముఖ్యమైన మార్పును తెలియచేస్తోంది. పైగా యీమార్పు భారతదేశానికి ఎంతో లాభకరమైనట్టిది.

"శ్రామిక ప్రజాసామాన్యంయొక్క జీవన ప్రమాణం అపారంగా తగ్గటం బెంగాల్ వంటి రాష్ట్రాలలో ప్రజలు ఆకలికి ఆహుతి అయి మలమలమాడటం-ఈ విపరీతబలిదానంతో భారతదేశం ఆర్థికంగా నూతనస్థాయిని పొందగల్గింది. (222 పేజీ)

గ్రేట్ బ్రిటన్‌కు అప్పుపెట్టే స్థితికి నిజంగా భారతదేశం మార్పుచెందిందా? ఒక గుమాస్తాలాగా, గుడ్డెద్దు చేలో పడ్డట్లు, మనము యీ సమస్యను పరిశీలించినట్లయితే అవుననే నిస్సందేహంగా సమాధానం చెప్పాల్సివుంటుంది. కాని ఎవరు ఎవరిని దోచుకుంటున్నారు? అని యీసమస్యను పరిశీలించినట్లయితేఅప్పుడు మనకు స్పష్టంగా బోధపడుతుంది. ఇంగ్లండులో పేరుకుపోయివున్న అదనపు విలువ అంతా భారతదేశానికి చెందుతుంది. కాని దానికి విరుద్ధంగా, భారతదేశము అప్పుపెట్టే స్థితిలో వున్నప్పటికీ, భారత దేశమేసాలీనాఇంగ్లండుకు పెద్దమొత్తాలను చెల్లిస్తోంది. దీనిని అర్థంచేసుకోవటం చాలా తేలిక. ఇండియా (పాకిస్థాన్‌తో సహా) కు బ్రిటన్‌నుంచి రావలసిన మొత్తాలు ఏ రకమైన వడ్డీ చెల్లించనక్కర లేని స్టేట్ మూలధనంగా పరిగణించబడు తున్నాయి. కాని ఇండియాలోని బ్రిటిషు పెట్టుబడులు ప్రధానంగా ప్రత్యక్ష పెట్టుబడులు కావటం మూలాన, విపరీతంగా సాగించబడుతున్న దోపిడిని ఆధారము చేసుకొని అసామాన్య లాభాలు గడించుతున్నారు. పెట్టుబడుల మొత్తం విలువను మాత్రం తీసుకుంటే ఇండియా బ్రిటన్‌కు ఋణదాత. పెట్టుబడులపై వచ్చే వడ్డీని దృష్టిలో వుంచుకుంటే, ఇంగ్లండు యిప్పటికికూడ భారతదేశాన్ని దోచుకుంటూనే వున్నది.

ఇండియాలోని బ్రిటిషు పెట్టుబడులు వల్ల ఇంగ్లండుకు భారతదేశంలో చాలా బలమైన ఆర్థిక, రాజకీయస్థానం సుస్థిరం చేయబడుతోంది. భారతదేశానికి యివ్వవలసిన ఋణాన్ని ఎప్పుడు, ఎంతవరకు, ఏ పరిస్థితులలో యివ్వాల్సిందీ నిర్ణయించేది బ్రిటిషు రాజ్యాంగయంత్రమే. కనుక అది మరింత లాభసాటియైనది. ఈ ఋణాన్ని మొత్తంగా ఇండియాకు తిరిగి చెల్లించ రాదని కొంతమంది బ్రిటిష్ రాజకీయ వేత్తలు సలహాలిచ్చారు. భారతదేశరక్షణ కారణంగా యీ ఋణం పేరుకుపోయిందనే మిషతో వారు పైవిధంగా సూచించారు. యథార్థం చెప్పాల్సివస్తే ఇండియా ఏ విధంగాను తనకు ఆ మొత్తం చెల్లించమని బ్రిటన్‌ను వత్తిడిచేయలేదు. తన ఋణగ్రస్తులు అప్పులచెల్లించటం ఆలస్యమైనప్పుడల్లా తరచు బ్రిటన్ వారిపైకి నౌకాదండయాత్రచేసి, వారిపై బాంబులు వేసింది. కాని ఇండియా తన నౌకలను పంపి బ్రిటన్ కోస్తాలపై అగ్నివర్షం కురిపించలేదు. ఒకవేళ బ్రిటన్ సాలీనా వాయిదాలమీద తన ఋణాన్నంతా తీర్చుకుంటాననంటే * అలా ఎందుకంటుందో కూడ విదితమే. ఋణంచెల్లించమని బహిరంగంగా తెగవేసి చెప్పినట్లయితే అమెరికన్ పెట్టుబడుల ప్రవాహం భారతదేశంలోకి చొచ్చుకపోయి, అమెరికా ప్రభావం పెచ్చుపెరిగే ప్రమాదానికి దారి తీస్తుంది.

ఈ లోపాన్ని నేను గుర్తిస్తున్నప్పటికీ, ఇక్కడ ఒక విషయం మాత్రం తిరిగి ప్రస్తావించాలనుకొంటున్నాను. ఇండియా, గ్రేట్ బ్రిటన్‌ల మధ్యగల సంబంధాలలో

* భారతీయ పెట్టుబడిదారులు యంత్రాలు, ఉత్పత్తిసాధనాలు పంపమని బ్రిటిష్ పరిశ్రమలను కోరినప్పుడు పంపటంలేదనీ, దీనికి కారణం లండన్ లోని ఇండియా ప్రస్తుతఖాతానుండి వాటిఖరీదు చెల్లించబడటమేనని భారతీయ ఆర్థిక పత్రికలు అభియోగం తెస్తున్నాయి.

"ఎట్టి విధమైన మార్పురాలేదని"ని ప్రకటించటం అసంభవమౌతుంది. భారతదేశంలో గ్రేట్ బ్రిటన్ అనుభవిస్తున్న ఆర్థిక రాజకీయ సైనిక స్థానాన్ని యిలా మనం నిర్ధారణ చేసాం. [భారతదేశం పాకిస్తాన్ దేశాలలో తనకుగల ప్రత్యేక అవకాశాలు (ప్రిఫరెన్షియల్ డ్యూటీస్)ను పూర్తిగా వినియోగించుకొంటోంది. ఈ రెండు దేశాలుకూడ స్టెర్లింగు బ్లాక్ బందిఖానాలోనే వున్నాయి.] బ్రిటిషు సైన్యాల ఆక్రమణక్రింద వుంటూ బ్రిటిషు అధికార్ల పాలనకింద వలసదేశంగా వుంటూవచ్చిన భారతదేశం అర్ధవలస అధినివేశదేశంగా మారింది. ఈ దేశంలో బూర్జువావర్గం కార్మిక, కర్షకోద్యమాలను చూసి భయకంపితమై బ్రిటిషు సామ్రాజ్యవాదంతో రాజీపడి స్వాతంత్ర్య పోరాటానికి ద్రోహం జేసింది. తన స్వార్థాన్ని యీడేర్చుకోవటంకోసం సైనికయంత్రాన్ని ప్రయోగిస్తోంది.

క్లుప్తంగా చెప్పాలంటే యిప్పటివరకు వలసదేశంగా వుంటూవచ్చిన భారతదేశం అధినివేశదేశంగా మారటంలోగల ప్రాముఖ్యతను ఏ విధంగాను ఎక్కువగా అంచనా వేయరాదు. ఏమైనప్పటికి చారిత్రకక్రమమైన గొలుసులో మనకళ్ళముందే బ్రిటిషు సామ్రాజ్యవాదం నీరసించి, పతనం చెందటానికి యిదొక లింకుగా మాత్రం పరిగణించాలి. *

తనవర్గ ప్రయోజనాలకోసం భారతీయ బూర్జువావర్గం సిగ్గులేకుండా మధ్యలో స్వాతంత్ర్య పోరాడానికి ద్రోహంచేసింది. భారతదేశానికి సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని అద్యతనచారిత్రక భవిష్యత్తులోనే కార్మికవర్గ నాయకత్వంక్రింద భారతశ్రామికప్రజానీకం సాధించనున్నది. అంటే బ్రిటిష్ ప్రభువులతోపాటు భారతీయ భూస్వాములు బూర్జువావర్గం అంతమవడమన్న మాట.

• రాజకీయాలనుంచి ఆర్థికవిషయాల వివరణను తప్పుడు పద్ధతిలో వేరుచేయటం, యుద్ధకాలపు ఆర్థికవిధానంలో రాజ్యాంగయంత్రంయొక్క పాత్రను గతి తార్కికానికి విరుద్ధంగా రెండుభాగాలకింద విభాగించి పరిశీలించటం, (గ్రంథం మొదటి భాగంలో నియమావళి పరిశీలనంటూ ఒకటి, దానికి సంబంధంలేకుండా గ్రంథం రెండవభాగంలో ఈ నియమావళిని లెక్కచేయకుండా ఉత్పత్తిలో ప్లానులేకుండా సాగుతున్న అరాచకాన్ని పరిశీలించటం) ఈ సమస్యలోని రాజకీయభాగానికిచెందిన పరిశీలననువివరణలో పూర్తిగామినహాయించటం-యుద్ధకాలపుఆర్థికవిధానంలో పెట్టుబడిదారీవిధానాభివృద్ధియొక్క ప్రధానఆర్థిక సూత్రాలు పనిచేయటాన్ని నేను కాదంటున్నాననే భావాన్ని యివన్నీ కలిగించాయి. యుద్ధకాలంలో పెట్టుబడిదారీ సంబంధ బాంధవ్యాలలో ప్రణాళికాబద్ధ

* అమెరికన్ సామ్రాజ్యవాదంచేత బ్రిటిష్ సామ్రాజ్యవాదం ప్రతిప్రాంతంనుంచి నెట్టివేయబడుతోంది. రూర్, పాలస్తీనా, గ్రీస్ మొదలగు ప్రాంతాలనుంచి బ్రిటిషు సామ్రాజ్యవాదాన్ని అమెరికన్ సామ్రాజ్యవాదం పారద్రోలింది "వెనకబడ్డ ప్రాంతాలకు సహాయం" అంటూ అమెరికన్లు వేస్తున్న ప్లానులఉద్దేశం యూరపియన్ సామ్రాజ్యవాదదేశాల అదీనంలోవున్న ముఖ్యంగా బ్రిటిషుసామ్రాజ్యవాదుల అధీనంలోవున్న-వలసదేశాలలో అమెరికలో పెట్టుబడులను అధికంగా తెప్పించటం మాత్రమే.

ఆర్థికవిధానం అవతరిస్తుందని వక్కాణించు తున్నాననే భావాన్ని కలుగచేసింది. ఏవిధంగానూ యిది నా ఉద్దేశంకాదు. నా గ్రంథంయొక్క 85 వ పేజీలో ఇలా రాసాను. "యుద్ధకాలంలోని ఆర్థిక విధానంయొక్క నియమావళిని 'ప్రణాళికా బద్ధ ఆర్థికవిధానం'అని పిలవటం పూర్తిగా శుద్ధతప్పే". కాని సమస్యను మొత్తం చూపెట్టవలసి వచ్చేసరికి మార్క్సిస్టు స్పష్టీకరణ లోపించింది.

తన పొరపాట్లను సమర్థించుకోవాలని చూసేవాళ్ళ విషయంలో సాధారణంగా జరుగుతున్నట్లు నేనుకూడ యీ లోపా లను యింకా పెంచుకున్నాను. యుద్ధా నంతరం "కొన్ని పెట్టుబడిదారీ దేశాలలో విచిత్రస్వభావంగల 'ప్రణాళిక' (గాస్ ప్లాన్) ప్రత్యక్షమైంది.' 'పెట్టుబడిదారీ విధానంలో ప్లానింగ్ సమస్యనుగూర్చి చేసిన ప్రకటనలన్నీ నేను వెనకతీసుకున్న సక్రమపంథానుండి పెద్దతిరోగమనాన్ని తెలియచేస్తున్నాయి.

1935 సం॥ కమ్యూనిస్టు ఇంటర్ నేష నల్ ఆరవకాంగ్రెస్‌లో మాట్లాడుతూ, సంస్కరణవాదులు క్రమబద్ధమైన పెట్టు బడిదారీ విధానాన్ని (ప్లాన్‌డ్ క్యాపిట లిజం)గూర్చి చేసే పదాడంబర ప్రచా రంలో బండారాన్ని యిలా వర్ణించాను.

"ప్రధాన కారణాలుయివి:— (1) మార్కెట్ల సమస్యను పరిష్క రించలేక పోవటం, (2) రాజ్యాంగ యంత్రంయొక్క ఖజానాను ఆర్థిక పెత్తందార్లు కొల్లకొట్టడాన్ని కప్పి పుచ్చటానికి ప్రయత్నం చేయటం, (3) యుద్ధావసరాలకు తగినట్లు జరిగే జాతీయ ఆర్థికవిధాన పునర్నిర్మా ణాన్ని మరుగుపర్చ ప్రయత్నించటం, (4) విప్లవకర శ్రామికప్రజాసామా న్యంయొక్క పురోగమనాన్ని నిరో ధించటానికి ప్రయత్నించటం".

'మార్షల్‌ప్లాన్' సందర్భంగా సంస్క రణ వాదులు పెట్టుబడిదారీ విధానంలో క్రమబద్ధమైన ఆర్థిక విధానం అంటూ సాగించే అబద్ధప్రచారానికి వ్యతిరేకంగా నిర్ణయాత్మకమైన సంఘర్షణను కొన సాగించాలనటం నిర్వివాదాంశం. *

* * *

నూతన ప్రజాతంత్ర దేశాల అవతర ణను ఒక్క రాజకీయ సూత్రీకరణ (పొలిటికల్ ఫార్మ్యులేషన్) గా నే భావించి, దానిని గురించివ వివరణను ముందు ముందు రాయాలని సిద్ధపరచిన రాజకీయ భాగమైన రెండవ భాగంలో యివ్వాలనుకోవటం పూర్తిగా తప్పు. పెట్టుబడిదారీ విధానంలోనుంచి యీ దేశాలు నిష్క్రమించటమనేది, రెండవ ప్రపంచయుద్ధంవల్ల సంఘటిల్లిన అత్యంత ప్రధానమైన సామాజిక - ఆర్థిక ఫలితా లలో యిదొకటని నిస్సందేహంగా చెప్ప వచ్చు. పెట్టుబడిదారీ విధానంలో తీవ్ర తరమౌతున్న జనరల్ సంక్షోభాన్ని ఇది సూచిస్తోంది.

"శుద్ధ ఆర్థిక" దృష్టితో పాక్షికంగా పరిశీలించటంవలన ఈ దేశ సమూహాము

* అమెరికన్ గుత్తవ్యాపారస్థులు తమ యిల్లు అయిన అమెరికాలో గల వ్యక్తిగత వ్యాపారాన్ని కావాలంటూ, పశ్చిమ యూరపియన్ దేశాల కన్ ఆర్థిక పెత్తందార్ల ప్రయోజనాలకు అనువుగా తమతమ ఆర్థిక విధా పర్చమని పట్టుబడుతున్నారు.

యొక్క పాత్రను, ప్రాముఖ్యతను తప్పుగా గణించటానికి దారితీసింది. ఆ తప్పుడు గణనలో యిలా తెల్పబడింది:

"ఏమైనప్పటికీ యీ దేశాల ప్రాముఖ్యత, ప్రాధాన్యత ఏమిటంటే ఒక కొత్తరకమైన ఆర్థిక విధానం అమలోకివచ్చింది. దీనిని పెట్టుబడిదారీ విధానమనే పదం యొక్క పాతఅర్థంలో పిలవటానికి వీలులేదు ప్రపంచ పెట్టుబడిదారీ ఆర్థికవిధానంపై యీ దేశాల యొక్క ప్రభావం తదితర దేశాలతో పోల్చి చూస్తే మొత్తం మీద చాలా తక్కువ. ప్రస్తుతానికి యీ దేశాలు పెట్టుబడిదారీ విధానంయొక్క జనరల్ అభివృద్ధిపోకడను మొత్తంగా మొదలంటా మార్చలేవు.

(పేజీ 291)

ఈవిధంగా నిర్ధారణ చేయటం నిరుపయోగం మాత్రమే కాకుండా మహా తప్పిదంగూడ. ఈ రాజ్యాంగ యంత్రాలను పెట్టుబడిదారీ రాజ్యాంగ యంత్రాలని భావించట—'పెట్టుబడిదారీ అనే పదం యొక్క పాత అర్థంతో కాక' పోయినప్పటికీ - పొరపాటు. యెందువల్ల నంటే యీ దేశాలు సోషలిజంవైపు పురోగమించే మార్గంలో త్వరితక్రమంలో రాటుతేలుతున్నాయి. (నేను ఇదివరకేచర్చలో ...ు) యీ దేశాలలో స్టేట్ ...ం (ప్రభుత్వ పెట్టుబడి ... ప్రబలంగా వుందనటం ...ం లేని ఆర్థిక అభిప్రా...యాలను ఆధారం చేసుకొని వీటియొక్క ప్రాముఖ్యతను 'ఇతరదేశాలలో పోల్చిచూస్తేచాలా తక్కువ' అని నిర్ణయించటం ప్రత్యేకమైన పొరపాటు. నూతన ప్రజాతంత్ర రాజ్యాంగయంత్రాలు అవతరించటం, స్వానుభవాన్ని ఆధారంచేసుకొని త్వరితగతిని సాగే వీటియొక్క సోషలిస్టు ఆర్థికాభివృద్ధి, వికాసం, శ్రామిక నియంతృత్వంయొక్క విధులను నెరవేర్చే ప్రభుత్వాలకు సోవియట్ యిచ్చే సంపూర్ణ సహాయ సహకారాలు- యివన్నీ చాలా ప్రాధాన్యతను కలిగివున్నాయి. గతితార్కికేతరమైన, పద్ధతిలో వట్టి 'ఆర్థిక' విషయంగానే పరిశీలించటంవల్లనూ, కొత్తదీ, అభివృద్ధి చెందేదీ అయినదాని విషయంలో సమగ్రంగా ఆకళింపుచేసుకోవలసిన అవసరాన్నిగూర్చి కామ్రేడ్ స్టాలిన్ యిచ్చిన ఉపదేశాలను మరచిపోవడంవల్లనూ, నూతన ప్రజాతంత్రదేశాల ప్రాధాన్యతను, పాత్రనుసరిగా నిర్ధారణ చేయలేకపోయాను.

రాజకీయాలనుంచి ఆర్థిక విషయాలను వేరు పరచటంవల్ల యితర రకమైన పొరపాట్లకుకూడ దారితీసింది. యుద్ధకాలపు ఆర్థిక విధానంలో మాత్రం కార్మికుల పాత్ర, ఉత్పత్తిలో వర్గపోరాటానికి దూరంగా వుండేశక్తి అనే పాక్షిక పరిశీలన, రెండు వ్యవస్థల మధ్యవున్న సంఘర్షణను అలక్ష్యంచేయటం, యుద్ధకాలంలో ప్రజాస్వామిక కూటమిలో యీ సంఘర్షణ 'విరమించబడిందని' తప్పుగా సిద్ధాంతీకరించటం, నూతన ప్రజాతంత్ర దేశాలలో అమలు జరపబడిన వ్యవసాయ సంస్కరణలను తప్పుగా గణించటం మొదలైన వాటిని ప్రత్యేకంగా యిక్కడ చర్చించలేను. తప్పుడు పద్ధతిలో వివరణను

పూనుకోవటంవల్ల కల్గిన ఫలితం ఏమిటంటే పెట్టుబడిదారీ విధానంలోని జనరల్ సంక్షోభ సమస్య నా గ్రంథంలో చర్చించబడనేలేదు. ఇది అత్యంత ప్రధానమైన విషయం. ఇదంతా చదువరిలో ఏ అభిప్రాయాన్ని కల్గిస్తుంది? తీవ్రతరమౌతున్న సంక్షోభం పైన, రెండవ ప్రపంచ యుద్ధం యొక్క పరోక్షమైన ప్రభావం పడలేదనే అభిప్రాయాన్ని చదువరిలో తప్పనిసరిగా కల్గిస్తుంది. ఒకే గ్రంథంలో అన్ని సమస్యలను పరిశీలించటం వాస్తవంగా అసంభవమైన విషయం. కాని పెట్టుబడిదారీ విధానంలోని జనరల్ సంక్షోభాన్ని గూర్చిన సమస్య పూర్తిగా లోపించటం మహా ప్రమాదకరమైన లోపం. విమర్శకులు బయట పెట్టిన పొరపాట్లను అంగీకరించటంలో నేను చేసిన సుదీర్ఘమైన ఆలస్యం నిస్సందేహంగా హాని కల్గించింది. మార్క్సిజం-లెనినిజం ఎన్నడో సక్రమంగా పరిష్కరించిన సమస్యలపై మన విమర్శకులు పూనుకొని కృషి చేయటానికి అడ్డుతగిలింది. ఇంతకన్నా విషాదకరమైనవిషయమేమంటే సామ్రాజ్యవాద కూటమిలోని యుద్ధోన్మాదులకు మనపై దుమ్మెత్తి పోయటానికి ఒక చక్కటి అవకాశం దొరికింది. నేను 'పాశ్చాత్య అభిప్రాయాలు'కల మనిషినని అబద్ధం ప్రచారం చేసేందుకు వీలుకల్గింది. పాశ్చాత్య అభిప్రాయాలుకల మనిషి అంటే విప్లవ ప్రతీఘాతకుడు, కార్మికవర్గ ద్రోహి అని అర్థం.

చేసిన పొరపాట్లను చిత్తశుద్ధితో అంగీకరించి, భవిష్యత్తులో తిరిగి ఆ పొరపాట్లు చేయకుండేందుకుగాను వాటికిగల మూలకారణాలను సవివరంగా అర్థము చేసుకోవాలని లెనిన్ ఏదైతే చెప్పాడో అదే నిజంగా సక్రమమైనమార్గం. కమ్యూనిస్టుపార్టీల విషయంలోను, వ్యక్తిగత కామ్రేడ్ విషయంలోనూకూడ యిదే సక్రమమైన మార్గం.

సిద్ధాంతరీత్యా, పోరాట దృష్ట్యా అత్యుత్తమ గ్రంథమైన "అతివాద కమ్యూనిజం: ఒక బాలారిష్టం" అన్నదానిలో లెనిన్ యిలా రాసాడు:

"వ్యక్తుల విషయంలో చెప్పినదే రాజకీయాలలోనూ, పార్టీల విషయంలోనూ, అవసరమైనదిద్దుబాట్లతో అన్వయిస్తుంది. తెలివిగలవాడు పొరపాట్లు చేయడని కాదు. అలాంటి వాడు యింతవరకు లేడు. ఇకముందు ఉండబోడు. మరింత ప్రధానమైన పొరపాట్లు చేయకుండా, చేసిన పొరపాట్లను ముందుగానూ, సత్వరంగాను, సరిదిద్దుకునేవాడే. తెలివైనవాడు.

(సెలెక్టెడ్ వర్క్స్ - వాల్యూం 10 పేజీ 288)

ఈవిషయంలో నేను తెలివితక్కువగా ప్రవర్తించాననటంలో సందేహంలేదు.

యుద్ధకాలంలో వరల్డ్ ఎకానమీ: వరల్డ్ పాలిటిక్స్ అనేపాతసంస్థచే రచించబడిన మిగతా గ్రంథాలలో దొర్లిన ఇతర లోపాలుకూడ సిద్ధాంతరీత్యా ఇదేతరహాకు చెందినట్టివి. ఆగ్రంథకర్తలంతా నానాయకత్వంక్రింద పనిచేశారు. అందువల్ల వారి

నాయకుడుగా ఆ పొరపాట్లన్నిటికి పూర్తి బాధ్యతను నేనే వహిస్తున్నాను.

చేసిన పొరపాట్లనుండి నేను గుణపాఠాలను భావిని దృష్టిలోవుంచుకొని స్వీకరించాలని వేరే చెప్పనవసరంలేదు. నా గ్రంథంయొక్క రెండవభాగాన్ని పూరించటంకోసం ఒక్క రాజకీయసమస్య పైననే ప్లానువేసుకోవటం యిప్పుడు సాధ్యపడదు. యుద్ధకాలంలోనూ యుద్ధానంతరమూ వచ్చిన ప్రధానమైన ఆర్థిక మార్పులను వదలివేసి ప్రస్తుత సామ్రాజ్యవాద పాలసీలపైననే రచనలు చేయ పూనుకోవటంకూడ తప్పుడు పద్ధతే అవుతుంది.

"సామ్రాజ్యవాదం సోషలిజంయొక్క విచ్ఛిన్నత" అన్న తన గ్రంథంలో లెనిన్ కాట్స్కీనిగూర్చి యిలారాసాడు :

"కాట్స్కీయొక్క యీ నిర్వచనం సిద్ధాంతరీత్యా పూర్తిగా తప్పులతడిక. తనయొక్క అపభ్రంశ బూర్జువాసంస్కరణ వాదానికి మార్గాన్ని సుగమం చేసుకోడానికి కాట్స్కీ సామ్రాజ్యవాదం యొక్క రాజకీయాలను దాని ఆర్థిక విధానంనుంచీ- రాజకీయాల్లోని గుత్తాధికారాన్ని ఆర్థిక విధానంలోని గుత్తాధికారంనుంచి వేరుపరుస్తున్నాడు."

క్లుప్తంలో చెప్పాలంటే నా యిదివరకటి పుస్తకం రెండవభాగాన్ని రాయటానికి ప్లానువేయటం మానివేసి, దాని స్థానే కొత్తగ్రంథాన్ని, స్వతంత్రమైన గ్రంథాన్ని రాయటానికి పూనుకోవటం ఉత్తమం. సామ్రాజ్యవాదంయొక్క యుద్ధానంతర ఆర్థిక రాజకీయ సమస్యలపై "రెండవ ప్రపంచ యుద్ధకారణంగా పెట్టబడిదారీ ఆర్థికవిధానంలో వచ్చిన మార్పులు" అన్న గ్రంథంలో చేసిన సంస్కరణతత్వ పొరపాట్లు లేకుండా తిరిగి కొత్తగ్రంథంరాయాలి.

---

సభ్యులు కానివారి ఎదుట మన కామ్రేడ్స్ అనేకమంది తమ గొప్పలు చెప్పుకోజూస్తారు ఇతరులను తక్కువ దృష్టితో చూస్తారు. ఇతరుల్లో ఉండేసుగుణాలను గుర్తించ నిరాకరిస్తారు. ఇవన్నీ ఒంటెత్తుగడల లక్షణాలు. ఏ కొంచెమో మార్క్సిజం లెనినిజం చదివిన ఈ కామ్రేడ్స్ వినయవిధేయతలు నేర్చుకోడానికి బదులుగా ఎక్కువ గర్విష్ఠు లవుతున్నారు.

మౌ-సి-టుంగ్

"న్యూ చైనా న్యూ వరల్డ్" పేజి 62

# బ్రిటిష్ డొమినియన్‌లలోని లేబరు పార్టీల అభివృద్ధి నిరోధక పాలసీ

ఎ. మిలీకోవస్కీ

బ్రిటిష్ సామ్రాజ్యం: ఇందులో రెండురకాల కాలనీలువున్నాయి. ఒకటి : వలసదేశాలు. యివి నిజానికి "ప్రజల బందిఖానాలు" రెండు : వలసపోయిన ఆంగ్లో శాక్సన్లు స్థిరనివాస మేర్పరచుకొన్న కాలనీలు. ఈ దేశాలలోని స్థానిక ప్రజలను నిర్దాక్షిణ్యంగా వెళ్ళగొట్టి ఆంగ్లో శాక్సన్లు ఆక్రమించుకొన్నారు. ఈ కాలనీలను బ్రిటన్ దోపిడీ చేస్తూ అక్కడ ప్రజలను బ్రిటిషు పెట్టుబడికి దాసానుదాసులను చేసింది.

ఆంగ్లో - శాక్సన్లు వలసవచ్చి స్థిరనివాస మేర్పచుకొన్న కాలనీలలో పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానం కొంతవరకు త్వరితగతినే అభివృద్ధి చెందింది. స్థానిక బూర్జువాజీ బలపడి, ఆతరువాత మాతృదేశ (బ్రిటన్) బూర్జువాజీతో అంతరంగిక మార్కెట్టులో పోటీ వ్యాపారాన్ని సాగించింది.

వలసవచ్చినవారి కాలనీలను మామూలు పద్ధతులతో దోపిడీ చేద్దామనే బ్రిటిషు సామ్రాజ్యవాదుల ప్రయత్నాలు 18 వ శతాబ్దం రెండో భాగంలోనే విఫలమయ్యాయి. ఈ కాలనీలు 1931 వెస్టమినిస్టర్ స్టాట్యూటు ప్రకారం డొమినియన్‌లుగా మార్చబడ్డాయి. ఇవి సామాన్యంగా బ్రిటన్‌తో పాటు సరిసమాన హోదాలో వుంటూ "బ్రిటిషు కామన్‌వెల్తు" లో సభ్యులుగా

వుంటాయి. ఈవిధంగా కెనడా, ఆస్ట్రేలియా, న్యూజీలాండ్, దక్షిణాఫ్రికా యూనియన్ మొదలుగాగల కాలనీలు డొమినియన్లుగా ఏర్పడ్డాయి.

ఇండియా—పాకిస్తాను, సిలోనులకు అధినివేశ ప్రతిపత్తిని ప్రసాదించడం మూలంగా వాటి స్థితిలో ప్రధానంగా వచ్చిన మార్పేమీ లేదు. ఈ విధంగా యీ దేశాలకు అధినివేశ ప్రతిపత్తి నివ్వడం జాతీయ విముక్తి ఉద్యమాల వొత్తిడిని తట్టుకోలేక తమ వలస పరిపాలన విధానంయొక్క పై స్వభావాన్ని మార్చిన కుట్ర మాత్రమే. ఇది అందరికీ బహిరంగంగా తెలిసిన విషయమే. నూతన డొమినియన్ల ప్రజలు వలస బానిస పరిపాలనా భారాన్నుండి విముక్తి చేయబడలేదు. పీరిమధ్యా పాత బ్రిటిషు డొమినియన్ల ప్రజలమధ్యా జాతీయంగా, సాంఘికంగా, ఆర్థికంగా విపరీతమైన అసమానత్వం అలాగే ఉంది. ప్రస్తుత వ్యాసం ఆంగ్లో—శాక్సన్లు వలసవచ్చి స్థిరనివాసమేర్పరచుకొన్న పాత బ్రిటిషు డొమినియన్లను గురించే వివరించుతుంది.

అసలు ప్రధాన దేశమైన బ్రిటన్లోని ప్రజలూ, బ్రిటిష్ సామ్రాజ్యంలో 'బ్రిటిష్ కామన్‌వెల్తు' సభ్యులుగావున్న డొమినియన్ల ప్రజలూ కలసి, ఎలాంటిహక్కులు లేకుండా బ్రిటిష్ సామ్రాజ్యం లోనే అలమటిస్తున్న అశేష జనాభా పోల్చిచూసే బహుకొద్ది జనాభా మాత్రమే. అంతే కాదు; అల్పసంఖ్యాకమైన ఆంగ్లో—శాక్సన్ జాతి "ఉన్నత జాతికి" చెందిన వారని బ్రిటిష్ జాతివారు చెపుతారు. ఈసిద్ధాంతాన్ని 'ఆధారం' చేసుకొనే కాలనీలలోవున్న ప్రజలను తమ బానిసత్వంలో వుంచుకొని, అణచిపెట్టి వుంచడానికి హక్కునుకలిగివున్నామని వూహిస్తారు. వారిదృష్టిలో కాలనీలలో వున్న ప్రజలు "హీనజాతి"కి చెందినవారు. బ్రిటిష్ సామ్రాజ్యంలో వున్న మొత్తం 50 కోట్ల జనాభాలో 7 కోట్ల 20 లక్షల యురోపియన్లుమాత్రమే బ్రిటన్లోనూ డొమినియన్లలోనూ వున్నారు. వీరిలో 4 కోట్ల 80 లక్షలు బ్రిటన్‌లోనూ, ఒక కోటి మంది కెనడాలోనూ, 71 లక్షల మంది ఆస్ట్రేలియాలోనూ, 16 లక్షలమంది న్యూజీలాండ్‌లోనూ,

22 లక్షల మంది దక్షిణాఫ్రికా యూనియన్‌లోనూ నివసిస్తున్నారు. ఈ విధంగా బ్రిటిష్ డొమినియన్‌లలో 2 కోట్ల 30 లక్షల ఆంగ్లో-శాక్సన్లు యింక యితర యూరప్‌జాతులకు చెందిన ప్రజలు వున్నారన్నమాట అంటే మొత్తం సముద్రాంతర బ్రిటిష్ సామ్రాజ్యంలోని జనాభాలో నూటికి 8 కంటే తక్కువన్నమాట

విభజించి పరిపాలించే సూత్రాన్నిఎప్పటినుండో జీర్ణించుకొన్న బ్రిటిష్ సామ్రాజ్యవాదులు తమ సముద్రాంతర డొమినియన్‌లను యితర కాలనీలకంటే ఉన్నత స్థితిలో వుంచారు. కాని యీ డొమినియన్‌లు ప్రధాన దేశానికి (బ్రిటన్) లోబడేవుండాలి. బ్రిటిష్ సామ్రాజ్యంలోని పరస్పర విరుద్ధతలు తీవ్రమైనకొద్దీ, బ్రిటన్‌స్థితి బలహీనపడినకొద్దీ, సామ్రాజ్యంలోని అంతర్గత భాగాలుగానూ, బ్రిటిష్ సామ్రాజ్యానికి పునాదిగానూ డొమినియన్‌లప్రాముఖ్యత హెచ్చుకాజొచ్చింది. దానితోపాటు బ్రిటన్‌కూ డొమినియన్‌లకుమధ్యనున్న పరస్పరసంబంధాలలో మార్పుకూడా వచ్చింది.

డొమినియన్‌లస్వదేశ, విదేశ రాజకీయ ప్రతి ప్రవృత్తిలోని మార్పులు ఆర్థిక నిర్మాణాన్నిబట్టివచ్చాయి. ఇదవరకుపూర్తిగా వ్యవసాయక దేశాలుగామాత్రమే వుండి బ్రిటన్‌కు ముడిపదార్థాలను సరఫరా చేస్తూవచ్చిన డొమినియన్‌లు యిప్పుడు పారిశ్రామికంగా అభివృద్ధి చెందడం ప్రారంభమైంది. మార్కెట్లకోసం పోటీ తీవ్రమవడంతో డొమినియన్‌లలోని బూర్జువాజీ ప్రారంభదశలోవున్న తమ పరిశ్రమలను విదేశాల ముఖ్యంగా బ్రిటన్ పోటీనుండి కాపాడుకోడానికి రక్షణ సుంకాలను విధించే మార్గాన్ని చేబట్టింది. కాని ఇంపీరియల్ మార్కెట్టులో తమ స్వప్రయోజనాలు కూడా యిమిడి వుండబట్టీ, తమ మాతృదేశంపై ఆధారపడాలి గాబట్టీ బ్రిటన్ ఒత్తిడి ఫలితంగా బ్రిటిష్ వస్తువులకు ప్రత్యేక సదుపాయాలను డొమినియన్‌ల బూర్జువాజీ కలుగజేసింది. 1932లో బ్రిటిష్ వస్తువులకు ప్రత్యేక సదుపాయాలను కలిగించే విధానాన్ని కొంతవరకు విస్తృత పరచడంతో డొమిని

యన్‌లలోని కేంద్రీకృత స్వభావం కొంతవరకు సన్నగిలింది.

డొమినియన్‌ల బూర్జువాజీతో బ్రిటిష్ సామ్రాజ్యవాదులు రాజీ పడవలసిన అగత్యం ప్రథమ ప్రపంచ యుద్ధానంతరం మరింత ఎక్కువైంది. డొమినియల బూర్జువాజీ సహాయంతో సామ్రాజ్యాన్ని బలపరచుకొనేందుకు బ్రిటిష్ సామ్రాజ్యవాదులు డొమినియన్ బూర్జువాజీకి అనేక సహాయాలను కల్పించవలసివచ్చింది.

రెండో ప్రపంచయుద్ధం బ్రిటిష్ సామ్రాజ్యంలోని డొమినియన్‌ల స్థితిని మరింత బలపరచింది. బ్రిటన్ డొమినియన్‌ల మధ్య సంబంధాల మార్పుతోపాటు సామ్రాజ్యవాద యుగంలో పెట్టుబడిదారీ విధాన ఆర్థిక, రాజకీయ అభివృద్ధిలో అసమానత్వం స్పష్టంగా బయట పడింది. రెండో ప్రపంచయుద్ధ కాలంలో పరిశ్రమల అభివృద్ధి రేటు దృష్ట్యా బ్రిటన్‌ను డొమినియన్‌లు చాలవరకు మించాయి. యుద్ధకాలంలో బ్రిటన్‌లోని పారిశ్రామిక ఉత్పత్తి యుద్ధానికి ముందున్న దశకంటే 1/4 వంతు మాత్రమే పెరిగితే కెనడలో రెండున్నర రెట్లు పెరిగింది. ఆస్ట్రేలియాలో రెండింట మూడు రెట్లు పెరిగింది. అలాగే దక్షిణాఫ్రికాలోనూ, న్యూజీలాండ్‌లోనూ తగినంతగా పెరిగింది.

రెండో ప్రపంచయుద్ధ కాలంలో డొమినియన్‌లలోని పరిశ్రమలు యీవిధంగా అభివృద్ధిచెందడంతో బ్రిటిష్ పరిశ్రమలలోని అనేక ముఖ్య శాఖలకు ఇంపీరియల్ మార్కెట్టు యింకా మరికొంత కుదించబడింది. బ్రిటిష్ సామ్రాజ్యంలో సంక్షోభం మరింత తీవ్రతరమవడానికి నిస్సందేహంగా యిదొక ముఖ్య కారణం.

సామ్రాజ్య ఆర్థిక బలంలో బ్రిటన్ ప్రత్యేక ప్రాధాన్యత తగ్గిపోవడంతోపాటు సామ్రాజ్య ఆర్థిక కేంద్రంగా దాని పాత్ర కొంచె పడింది. యుద్ధకాలంలో బ్రిటన్ ఒకవైపున తన విదేశ పెట్టుబడులను అమ్ముకుంటూ వుండగా అదేసమయంలో డొమినియన్‌లు తమ రుణాలను చాలవరకు తగ్గించుకోగలిగాయి. కాని బహుకాల పెట్టుబడులకు సంబంధించినంతవరకూ డొమినియన్‌లకు బ్రిటన్ రుణదాతగానే ఉండిపోయింది. అంతేకాదు. డొమినియన్‌లే బ్రిటిషు పెట్టుబడులకు

ప్రధాన రంగాలుగా ఉండిపోయి నాయి. కిండెర్స్లీ అంచనా ప్రకారం (యివి బాగా తగ్గించి వేసినవి) 1936 కు వున్న మొత్తం 372 కోట్ల 50 లక్షల పౌనుల స్టెర్లింగు విదేశ పెట్టుబడులకూ, 134 కోట్ల 20 లక్షల పౌన్ల స్టర్లింగు డొమినియన్‌ల భాగానికే వస్తుంది. ఇందులో ఆస్ట్రేలియాలో 50 కోట్ల 5 లక్షలూ, న్యూజీలాండులో 14 కోట్ల 60 లక్షలూ, కెనడా, న్యూఫౌండులాండులలో 43 కోట్ల 30 లక్షలు, దక్షిణాఫ్రికా యూనియన్‌లో 24 కోట్ల 80 లక్షల పౌన్ల స్టర్లింగు ఉన్నాయి. అంటే మొత్తం బ్రిటన్ విదేశ పెట్టుబడులలో మూడోవంతుకంటే ఎక్కువన్నమాట. (ది ఎకానిమిక్ జర్నల్–డిసెంబరు 1937) ఇంకా సంపూర్తి లెక్కల అంచనా ప్రకారం 5.5 బిలియన్ పౌన్లస్టర్లింగుల బ్రిటన్ మొత్తం విదేశ పెట్టుబడులలోనూ డొమినియన్‌లలో వుంచబడిన పెట్టుబడులు 1.8 బిలియన్ పౌన్ల స్టర్లింగు. బ్రిటిషు వైట్ పేపర్ ప్రకటించిన అధికారయుత లెక్కలప్రకారం రెండో ప్రపంచ యుద్ధానంతరం ఆస్ట్రేలియా, న్యూజీలాండు, దక్షిణాఫ్రికా, ఐర్లెండులలో బ్రిటిషు పెట్టుబడుల అమ్మకం 20 కోట్ల 10 లక్షల పౌన్ల స్టర్లింగు, కెనడాలోని అమ్మకం 20 కోట్ల 5 లక్షల పౌన్ల స్టర్లింగు. మొత్తం 40 కోట్ల 60 లక్షల పౌన్ల స్టర్లింగు.

యుద్ధం ముగిసేప్పటికి డొమినియన్‌లలోని బ్రిటిష్ పెట్టుబడులు వందకోట్ల పౌన్ల స్టర్లింగ్‌కు పైగా ఉంది. వైట్ పేపర్ ప్రకటించిన లెక్కలప్రకారం 1945లో డొమినియన్‌ల నుండి బ్రిటన్‌కు రావలసిన వడ్డీలు, డివిడెండ్లూ 5 కోట్ల 90 లక్షలు ఉంటుంది. డొమినియన్‌లకు బ్రిటన్ చెల్లించ వలసిన వడ్డీలూ, డివిడెండ్లూ (స్టెర్లింగు అప్పుతోసహా) 1 కోటి 90 లక్షలుంటుంది. ఈవిధంగా బ్రిటన్‌కు 4 కోట్ల పౌన్ల స్టర్లింగు మిగులు ఉంటుంది.

ఇంత జరిగినా రెండో ప్రపంచ యుద్ధం డొమినియన్‌లలో బ్రిటన్ రుణదాతగా తన స్థానాన్ని చాల వరకు కోల్పోయేటట్లు చేసింది. ఆ తరువాత; యుద్ధం ముగిసిన తరువాత బ్రిటన్ అమెరికానేకాక, డొమినియన్‌లనుకూడా అప్పుపెట్ట వలసిందిగా అభ్యర్థించవలసి

వచ్చింది. కెనడానుండి బ్రిటన్ పెద్ద మొత్తాన్ని అప్పుగా తెచ్చింది. దక్షిణాఫ్రికా, ఆస్ట్రేలియాలు కూడా అప్పుపెట్టాయి. బ్రిటిష్ డొమినియన్‌లు పెట్టుబడిని ఎగుమతి చేయడం ప్రారంభించాయి. వాటివిదేశ వ్యాపారంలో పారిశ్రామిక వస్తువులే ప్రధానస్థానాన్ని వహించాయి. యుద్ధకాలంలోనే పరిశ్రమలపైతగినంతఆధిపత్యాన్ని సంపాదించిన గుత్త వ్యాపార సంస్థలు బ్రిటిషు సామ్రాజ్యంలోనూ, యింకా దాని సరిహద్దులు దాటికూడా నూతన మార్కెట్టులను సంపాదించడం ప్రారంభించాయి. నిజానికి బ్రిటిషుసామ్రాజ్యంలోని గుత్త పెట్టుబడిదారీ గ్రూపులు కాలనీలను దోపిడీచేసే విధానాన్ని గురించీ, ఇంపీరియల్ మార్కెట్టును తమలో పంచుకొనే విషయాన్ని గురించి ఒక విధమైన ఒడంబడికను ఏర్పరచుకొన్న కేపిటలిస్టులు వలసదేశాలను దోపిడీ చేసుకొనేందుకు బ్రిటిషు సామ్రాజ్యంలోని ప్రతి డొమినియన్‌కూ వాటా వుంటుంది. అయితే ఆవాటా ఆయాదేశాల పెట్టుబడి శక్తినిబట్టీ, ఆర్థిక, మిలిటరీబలాన్ని బట్టీ నిర్ణయమవుతుంది. యుద్ధ ఫలితంగా వివిధశక్తుల మధ్య వచ్చిన మార్పులు తప్పనిసరిగా డొమినియన్‌ల మధ్య. వ్యాపార మార్కెట్ల కోసం జరిగే పోరాటాన్ని మరింత తీవ్రతరంచేశాయి. యుద్ధకాలంలో కెనడా తన పలుకుబడిని న్యూఫౌండ్‌లాండ్‌లోనూ, బ్రిటిష్ వెస్టుఇండీస్‌లోనూ చాలవరకు విస్తరింపజేసుకొన్నది. యుద్ధం ముగిసినతరువాత న్యూఫౌండులాండును కెనడా ఫెడరేషన్‌లో ఒక అంతర్భాగంగా కూడా గణించడంప్రారంభించింది. ఇంపీరియల్ మార్కెట్టు కోసం కెనడా తనపోరాటాన్ని తీవ్రతరం చేసింది. తత్ఫలితంగా బ్రిటిష్ సామ్రాజ్యంలోని అన్ని దేశాలలోనూ తన వాణిజ్య ప్రతినిధులను నియమించింది. 1939 లో కెనడా ఎగుమతులలో నూటికి 11.1 సామ్రాజ్యంలోని దేశాలలోకి వెళ్లాయి. (బ్రిటన్ కాక) 1948 కి నూటికి 16.3 వరకూ హెచ్చింది. ఆస్ట్రేలియా, న్యూజీలాండులు యుద్ధకాలంలో దక్షిణ పసిఫిక్ మహాసముద్ర ప్రాంతంలోని బ్రిటిషు కాలనీ ప్రాంతాల భవిష్యత్తును నిర్ణయించడానికి తమకు స్వతంత్ర హక్కున్నదని

అనడం ప్రారంభించాయి. దక్షిణాఫ్రికా యూనియన్ సామ్రాజ్యవాదులు కూడా యుద్ధకాలంలో ఆఫ్రికాలోని బ్రిటిష్, బ్రిటిషువారికి చెందని ప్రాంతాలను తమ పలుకుబడిలో జేర్చుకోడానికి మొదలెట్టారు. దక్షిణాఫ్రికా యూనియన్ నాయకత్వం క్రింద ఒక ప్రత్యేకరకమైన విశాల – ఆఫ్రికాను ఏర్పాటు చేయాలనే పథకాన్ని కూడా వారు తయారుచేశారు.

1942 డిసెంబరులో అమెరికా పత్రిక "లైఫ్" స్మట్సు వ్రాసిన ఒక వ్యాసాన్ని ప్రకటించింది. ఈ వ్యాసంలో స్మట్సు బ్రిటిషు సామ్రాజ్యాన్ని పునర్నిర్మాణం చేయడానికి కొత్తప్లానును విపులంగా వివరించాడు. దీని ప్రకారం తమ తమ పలుకుబడిలో వున్న వలస ప్రాంతాలను ఆయా డొమినియన్‌ల యాజమాన్యంక్రిందకు వదిలి వేయాలని సూచించాడు. ఈ వ్యాసాన్ని అమెరికా పత్రిక ప్రచురించడంతో యీప్లానుకు అమెరికా సామ్రాజ్య వాదుల మద్దతు ఉన్నట్లు కనపడుతున్నది. ఎందువల్లనంటే యీప్లాను ఆచరణలోకి వస్తే బ్రిటన్ స్థితి తన సామ్రాజ్యంలోనే మరింత బలహీనపడుతుంది. అప్పుడు అమెరికా తన పెట్టుబడులను బ్రిటిషు సామ్రాజ్యంలోకి ప్రవహింపజేయడానికి చక్కని వీలు కలుగుతుంది.

డొమినియన్‌లు వాంఛించుతున్న యీ కోర్కెలను బ్రిటన్ పాలకవర్గాలు తృణీకరించలేవు. కాని అదే సమయంలో సామ్రాజ్య నాయకత్వం తమ చేతులలోనుండి పోవడానికి వారు యిష్టపడరు. సామ్రాజ్యంలో బ్రిటన్‌కు నాయకత్వ స్థానాన్ని వుంచేందుకుగాను డొమినియన్ ప్రతినిధులతో కూడిన ఒక సామ్రాజ్య యుద్ధ మంత్రివర్గాన్ని ఏర్పాటు చేయడానికి యుద్ధకాలంలో చర్చిల్ ప్రయత్నించాడు. అయినప్పటికీ బ్రిటిషు డొమినియన్‌లలో రోజురోజుకు పెరుగుతున్న అమెరికా సామ్రాజ్యవాదుల పలుకుబడి దీనికి ఒక ప్రధానమైన అడ్డంకిగా తయారైంది.

రెండో ప్రపంచ యుద్ధ ఫలితంగా బ్రిటన్‌కూ డొమినియన్‌లకూ మధ్య కలిగిన పరస్పర వైరుధ్యాల తీవ్రతతో బాటు మరొక వైపున వాటి పాలకవర్గాలను మరింత సన్నిహితం చేయు

డానికి కొన్ని శక్తులు సహాయ పడ్డాయి. ఈ శక్తులేమంటే వర్గ వైరుధ్యాలు వృద్ధికావడం, బ్రిటన్ డొమినియన్‌ల అంతరంగికంగా సంఘర్షణలు రావడం. దీనితో కార్మికవర్గానికి వ్యతిరేకంగా సంయుక్తంగా పోరాడేందుకు బూర్జువావర్గం ఒక ఒడంబడికకు వచ్చే ప్రయత్నాలు జరిగాయి. రెండు: బ్రిటన్‌కూ, కాలనీలకూ వైరుధ్యాలు తీవ్రతరమవడంతో బ్రిటిషు సామ్రాజ్యవాద బూర్జువా వర్గం డొమినియన్‌లతో కలిసి వలసదేశాల జాతీయ విముక్తి ఉద్యమాలను సంయుక్తంగా ఎదుర్కొనడానికి నూతన ప్రయత్నాలను ఆరంభించాయి. మూడు: ఆంగ్లో - అమెరికన్ వైరుధ్యాలు తీవ్రతర మవడంతో బ్రిటిషు బూర్జువాజీలోని కొన్ని వర్గాలలో సామ్రాజ్య సంబంధాలను దిట్టపరచుకొని, పరిమితిలేని అమెరికా విస్తరణనుండి ఇంపీరియల్ మార్కెట్టునుసంయుక్తంగా రక్షించుకోవాలనే వాంఛ ప్రబలమైంది.

మితవాద లేబర్‌పార్టీ సభ్యులు మొట్టమొదట నుండీ బ్రిటిషు సామ్రాజ్యాన్ని పట్టుదలతో బలపరచడానికీ, నిలబెట్టడానికీ తమ శాయశక్తులా తంటాలు పడుతున్నారు.

1944 శరదృతువులో మొట్ట మొదటి సారిగా సామ్రాజ్యంలోని డొమినియన్‌ల పరస్పర సహకారాన్ని బలపరచుకొనేందుకు బ్రిటిషు సామ్రాజ్యంలోని లేబరు పార్టీల సమావేశం లండన్‌లో జరిగింది. ఆనాడు అధికారంలో వున్న చర్చిల్ ప్రభుత్వం బ్రిటిషు సామ్రాజ్యవాదానికి నమ్మికబంటులైన మితవాద లేబరుపార్టీ సభ్యుల సహాయాన్ని అభ్యర్థించింది. వీరు ముక్కలు ముక్కలుగా చిన్నాభిన్నమవుతున్న బ్రిటిషు సామ్రాజ్యాన్ని కాపాడే విషయంలో ప్రధాన పాత్రను నిర్వహించడానికి సిద్ధపడ్డారు.

సంస్కరణవాదం సామ్రాజ్యంలో బాగా కరుడుగట్టుకొని వేళ్లు పాతుకు పోయింది. డొమినియన్‌లలో బూర్జువాజీకి అది ఒక ప్రబలమైన అండగా తయారైంది. ఉదాహరణకు ఆస్ట్రేలియాలో లేబరువాదులు బ్రిటన్‌లో మొదటి లేబరుపార్టీ మంత్రివర్గం ఏర్పడక ముందు - చాలకాలం క్రిందటనే అధికారంలోకి వచ్చారు. లేబరు

వాదులను పాలక పార్టీ పాత్రను నిర్వహించడానికి బ్రిటిషు పెట్టుబడిదారులచే తర్ఫీదు సిచ్చేందుకు డొమినియన్‌లు ఒక రకమైన పరిశోధనాలయాలుగా తయారయినాయి. వర్గసామరస్యం అనుసరించడంలో ఆస్ట్రేలియా లేబరు పార్టీ ఆదర్శనంతమైనదని అన్ని రకాల అవకాశవాదుల చేత అంగీకరించబడింది. నిరుద్యోగ ప్రమాదం ఎదుర్కొంటున్న బ్రిటిషు కార్మికునికీ, పెట్టుబడిదారులకు వూడిగం చేసే సంస్కరణవాదుల మోసానికి బలియైన కార్మికునికీ సముద్రాంతర "ప్రజాతంత్ర" డొమినియన్‌లలోకి వలస వెళ్లితే వుండే అద్భుతమైన సౌకర్యాలను గురించి చక్కని చిత్రం చూపెట్ట బడుతుంది.

ప్రథమ ప్రపంచ యుద్ధానంతరం బ్రిటన్‌లోని కీలక పరిశ్రమలు దెబ్బతిన్న ఫలితంగా దేశంలో నిరుద్యోగుల సంఖ్య విపరీతంగా పెరిగింది. అప్పుడు నిరుద్యోగ సమస్యను తగ్గించి, సాంఘిక పరిస్థితులు తలక్రిందు లయ్యే ప్రమాదాన్నుండి తప్పు కోడానికి డొమినియన్‌లలోకి వలస వెళ్లడానికి కార్మికులను ప్రోత్సహించారు. "ఎంత విపరీతమైన నీచపు రాజీలకైనా" బ్రిటిషు బూర్జువావర్గం పెట్టింది పేరు. (సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ చరిత్ర) బ్రిటిషు బూర్జువా తన స్వభావాని కనుగుణ్యంగా ఆ సమయంలో సైన్యాన్నుండి విడుదల చేయబడిన సైనికులను డొమినియన్‌లలో స్థిరపరచడానికి "ఇంపీరియల్ సెటిల్‌మెంటు" అనే ఒక పథకాన్ని కొనసాగించడానికి ప్రయత్నించింది.

కాని "ఇంపీరియల్ సెటిల్ మెంట్లను" సృష్టించడానికి పన్నిన యీ పథకం బ్రిటన్‌లోని నిరుద్యోగ సమస్యను తగ్గించేందుకు పెద్దగా సహాయపడలేదు. పెట్టుబడిదారీవిధానంలో ప్రవేశించిన సర్వతోముఖ సంక్షోభం డొమినియన్‌లలో కూడా విపరీతమైన నిరుద్యోగ సమస్యను తయారు చేసింది. ఇది బ్రిటన్‌నుండి వలసకు పెద్ద అంతరాయాన్ని కలిగించింది. 1929 – 33 లో వచ్చిన ప్రపంచ ఆర్థిక సంక్షోభం డొమినియన్‌లలోకి వలస పోవడాన్ని పూర్తిగా అరికట్టింది.

రెండో ప్రపంచయుద్ధానంతరం బ్రిటిషు ప్రభుత్వం స్వదేశంలోని నిరుద్యోగ సమస్యను తగ్గించడానికని తిరిగి వలసవెళ్ళడాన్ని ప్రోత్సహించడానికి ప్రారంభించింది. 1946 లో పదిలక్షల మంది బ్రిటన్ నుండి డొమినియన్‌లకు వలసపోవడానికి రిజిష్టరు చేయించుకొన్నారు. లేబరుపార్టీ పరిపాలన క్రింద ఉన్న బ్రిటన్‌లో మామూలుగా జీవించే ఆశలు అనేక మందికి సన్నగిల్లినట్లు యీ లెక్కలే రుజువుచేస్తున్నాయి. లేబరుపార్టీ కార్మికవర్గ వ్యతిరేక విధానం, అమెరికా గుత్తపెట్టుబడిదారుల ఆధిపత్యానికి బ్రిటన్‌ను గురిచేసే పాలసీ, రోజు రోజుకూ శ్రామిక జనసామాన్యం మరింత దరిద్రవంత మవడం – దీనంతటికీ ముఖ్యకారణం.

"ఎకానమిస్టు" పత్రిక (1948 జనవరి 3 వ తేదీ సంచిక) ప్రకారం 1946 లో 166,600 మంది ప్రజలు బ్రిటన్ నుండి వలస వెళ్లారు. (1938 లో 34000 మంది వెళ్ళారు) 1947 వ సంవత్సరం మొదటి 9 మాసాలలో 88000 మంది వలస పోయారు. ఇందులో 19000 మంది దక్షిణాఫ్రికాకు, 14000 కెనడాకు, 8000 ఆస్ట్రేలియాకూ, 4500 న్యూజీలాండుకు, 14000 మంది అమెరికాకు వలస వెళ్లారు. కాని డొమినియన్‌లకు వలసవెళ్లే అవకాశాలు చాలవరకు సన్నగిలాయి. యుద్ధం మూలంగా వచ్చిన పారిశ్రామిక "ఆర్థిక మాంద్యం" అనంతరం డొమినియన్ లీ కొంతవరకు ఆర్థికంగా విపరీత పరిస్థితులు ఎదుర్కొనవలసి వచ్చింది. ముఖ్యంగా నానాటికి అమెరికాపై ఆధారపడటం మూలంగా ఆర్థిక కష్టాలు ఎక్కువైనాయి.

డొమినియన్‌లు బ్రిటన్‌ను కాపాడతాయనే బ్రిటిషు బూర్జువాజీ ఆశలన్నీ వుత్తభ్రమలు మాత్రమే. ఈ చిన్న పెట్టుబడిదారీ దేశాలు కూడా (డొమినియన్‌లు) యుద్ధానంతరం కేపిటలిజంలోని తీవ్రతర సంక్షోభ ఫలితంగా వచ్చిన విపరీతమైన వైరుధ్యాలకు గురయినాయి. రానున్న ఆర్థిక సంక్షోభాన్ని బ్రిటిషు డొమినియన్‌లు తట్టుకోవలసి ఉంది. అంతేకాక; బ్రిటిషు సామ్రాజ్యాన్ని తమ స్వప్రయోజనాల కోసం వినియోగించుకొందామని ప్రయత్నించే అమెరికా సామ్రాజ్యవాదుల విపరీతమైన వొత్తిడికి

డొమినియన్‌లు గురికావలసి వస్తోంది. ఇది బ్రిటన్ పరిస్థితిని డొమినియన్‌లతో దానిసంబంధాలను చాలవరకు విషమింపజేసింది.

డొమినియన్ లలోని గుత్త పెట్టుబడిదారులు ప్రత్యేక సదుపాయాల విధానంగల బ్రిటిషు సామ్రాజ్యాన్ని అలాగే వుంచుకో గోరుతారు. ఈ దృష్టితో పరిశీలించితే ఇంపీరియల్ ఇండస్ట్రియల్ అసోషియేషన్ ప్రతినిధి డోనాల్డు సింప్సన్ 1948 జూన్ 5 వ తేదీన చేసిన యీ క్రింది ప్రకటన గమనించ తగింది :

"హవానా వాణిజ్య ఒడంబడికను ఆమోదించినట్లయితే అది ఒకే ఆర్థిక యూనిట్‌గా ఉన్న బ్రిటిషు సామ్రాజ్యాన్ని నాశనం చేస్తుంది. యావత్తు బ్రిటిషు సామ్రాజ్యమూ ఒకే స్వతంత్ర యూనిట్ గా వ్యవహరించితేనే అది అమెరికాతో పోటీచేసి జయంపొందే స్థితిలో వుండగలుగుతుంది."

అంగ్లో - అమెరికన్ లకు పరస్పరం పోటీ వున్న యీనాటి పరిస్థితులలో - బ్రిటన్‌లో మితవాద లేబరువాదులు అధికారంలో వున్న యీ సమయంలో- అమెరికా పోటీకి వ్యతిరేకంగా సామ్రాజ్య సంపత్తి నంతటనీ సమీకరించడం లేబరు పార్టీల పరస్పర సహకారం పైననే వీలుపడుతుంది. అమెరికా విస్తరణ అడ్డగించడానికి లేబరు వాదులందరి తీవ్ర ప్రయత్నాలను గురించి ప్రస్తుతం యిక్కడ వివరించడంలేదు. మితవాద లేబరు పార్టీలవారి ప్రయత్నాలన్నీ వాల్ స్ట్రీట్ ధనిక చక్రవర్తులతో కొంత లాభదాయకమైన బేరం కోసం మాత్రం. ఇందుకోసమే వారు సామ్రాజ్యంలోని యావత్తు బలాన్ని సమీకరిస్తారు.

డొమినియనులలోని లేబరు పార్టీల మితవాద నాయకులు తామధికారంలో వున్నప్పుడల్లా బ్రిటనులోని కన్సర్వేటీవ్ మంత్రివర్గాలతో సన్నిహితంగా సహకరించుతూనే ఉంటారు. అదేసమయంలో లండనులోని లేబరుపార్టీ పార్లమెంటరీశాఖమాత్రం 'రాజుగారికి వ్యతిరేక పక్షం' పాత్రను మాత్రం విధేయతతో కొనసాగించుతూనే ఉంటుంది. కన్సర్వేటివ్ ప్రభుత్వంపై అది చేసే "విమర్శన"లన్నీ కన్సర్వేటీవ్‌ల సామ్రాజ్యవాద పాలసీతో లేబరు

పార్టీనాయకత్వం ఆచరణలోచేసుకొనే ఒడంబడికలను కప్పిపుచ్చే ఉద్దేశ్యంతో మాత్రమే. బ్రిటిషు సామ్రాజ్యంయొక్క కలోనియల్ ప్రయోజనాలను కాపాడవలసి వచ్చినప్పుడల్లా డొమినియనులలోని లేబరుపార్టీ మితవాద నాయకులంతా బ్రిటిషు ప్రభుత్వాన్ని బలపరస్తూనే ఉంటారు. డొమినియనులలోని లేబరు నాయకులస్థితి బ్రిటనులోని వారి సోదరుల బూటకపు "వ్యతిరేకత"ను పూర్తిగా బట్టబయలు చేస్తుంది. బ్రిటిషు లేబరు ప్రభుత్వం సామ్రాజ్య పాలసీకీ, కన్సర్వేటివుల పాలసీకీ ఏవిధంగానూ తేడా లేదు. బ్రిటిషు సామ్రాజ్యంలో వున్న దేశాలకు సంబంధించిన విషయాలపై వెనకటి మంత్రివర్గాల పాలసీకీ యిప్పటి మంత్రివర్గాలపాలసీకీ ఏమీ భేదంలేదనీ, ఒకేవిధానం కొనసాగించబడుతున్నదని లేబరు నాయకులే స్వయంగా తమంతట తాముగా చెప్పుకొంటారు.

బ్రిటిషుసామ్రాజ్యానికి చెందిన "జాతిసిద్ధాంతాని"కి డొమినియనులలోని మితవాద లేబరునాయకులే ప్రధానరక్షకులుగా అమితపట్టుదలతో ముందు కొస్తారు. ఉదాహరణకువారే "తెల్ల ఆస్ట్రేలియా"పాలసీకి నాంది ప్రస్తావనచేసారు. 19వ శతాబ్దం ఆఖరునుండి అంతగా మనుష్యులునివసించని ఆస్ట్రేలియా ఖండంలోకి ఆసియాదేశాలలోని ప్రజలుకాని పసిఫిక్ మహాసముద్రంలోని దీవుల ప్రజలుగానీ అడుగుపెట్టకుండా నిషేధాన్ని ప్రయోగించారు.

ఆస్ట్రేలియా, న్యూజీలాండులలోని లేబరు అగ్రవర్గాలలోని అజ్ఞానులు అనుసరించే 'కుక్క కావలి' పాలసీని లెనిను తీవ్రంగా ఖండించాడు. న్యూజీలాండుపై జిగ్‌ఫ్రీడు రచించిన గ్రంథాన్ని గురించి లెనిను యిలా వ్రాశాడు:

"కరుడుగట్టిన, సంకుచిత, తెలివితక్కువ అహంభావాన్ని కలిగిన ఛోటాబూర్జువా వర్గంయొక్క దేశం. తమ రాకతోబాటు ఇంగ్లాండు నుండి "సంస్కృతి"ని వెంటనే బట్టుకొచ్చి కుక్క కావలి కాచేవారిలాగా కూర్చున్నారు. (వారు దేశీయులైన మోయిరిలను నిప్పులతోనూ, కత్తులతోనూ చంపివేశారు. అనేక యుద్ధాలు వరుసగా జరిగాయి)

—"నోట్సు ఆన్ ఇపీరియలిజం"

ఆస్ట్రేలియాలో లేబరు ప్రభుత్వం దేశీయప్రజలకు కనీస పౌరసత్వ హక్కులు కూడా లేకుండా చేసింది. అమానుషమైన

జాతివిభేద శాసనాలను కొనసాగిస్తున్నది. కటికి ఎడారులుగా వుండే మధ్య ప్రాంతాలలో కొంత భాగాన్ని ప్రత్యేకంగా రిజర్వు చేసి స్వదేశీయులను అక్కడుంచారు. కాని వారిని యిక్కడనుండి వెళ్ళగొట్టడానికి ప్రయత్నిస్తున్నారు.ఎందువల్లనంటే ఆ ప్రాంతాలను ఒక పరిశోధనాలయంగా వినియోగించడానికి ప్రయత్నాలు చేస్తున్నారు. ఈనాగరీక దోపిడి దొంగలు ఆంగ్లో శాక్సన్ "అధికృత"ను గురించి మానవులను ద్వేషించే జాతి సిద్ధాంతాన్ని అనుసరిస్తూ ఆస్ట్రేలియా ఆదిమవాసులలోని అధికభాగాన్ని యిప్పటికే వెళ్ళగొట్టారు. ఆస్ట్రేలియాలోకి మొట్టమొదట ఆంగ్లో - శాక్సన్లు వలస వచ్చినప్పుడు ఆదిమవాసులు 300 000 ఉండేవారు. ఈ నాడు వారు 60000 మాత్రమే ఉన్నారు.

దక్షిణాఫ్రికా యూనియన్‌లో జాతివిద్వేష మూర్ఖత్వం దారుణమైన స్వరూపాలను తీసుకొన్నది. ఇక్కడ మితవాద లేబరువాదులు రంగుభేధాన్ని అమలు పరస్తూ నీగ్రోలు నిపుణత్వంతో కూడిన పనులు చేయరాదని నిషేధించారు. నల్లవారిని దోపిడీ చేయడంలో బానిస పద్ధతుల నన్నిటినీ ప్రయోగిస్తున్నారు. ఒకేవిధమైన పనిచేసినందుకు తెల్లవారి కంటే నల్లవారికి అనేక రెట్లు తక్కువ రేటు కూలీని చెల్లించుతున్నారు.

డొమినియనులలోని మితవాద లేబరుపార్టీవారు బ్రిటను లోని తమ సోదరులవలెనే సామ్రాజ్యవాదుల విదేశాంగ విధానాన్ని, ముఖ్యంగా రెండో ప్రపంచ యుద్ధానికి దారితీసిన జర్మనీ ఫాసిజంతో చేసుకొన్న "మ్యూనిక్ ఒడంబడిక"ను సంపూర్తిగా బలపరచారు. దురాక్రమణదారులను తలదువ్వే లేబరుపాలసీ దూరప్రాచ్యంలో అతి స్పష్టంగా వెల్లడయింది. ఆస్ట్రేలియా, న్యూజీలాండులలోని మితవాద లేబరు పార్టీనాయకులు జపాన్ విస్తరణ దక్షిణ సముద్ర ప్రాంతంవైపు వుంటుందని తామెరుగుచూస్తున్నట్లు గట్టిగా చెపుతూవచ్చారు. కాని నిజానికి వారు జపాను దురాక్రమణను సోవియట్ యూనియనుకు వ్యతిరేకంగా మళ్ళించడానికి ప్రయత్నించారు. ఇక రెండో ప్రపంచ యుద్ధకాలంలో పశ్చిమయూరప్‌లో రెండోరంగం ప్రారంభించకుండా డొమినియనుల

లోని మితవాద లేబరు వాదులు అడ్డుపడ్డారు. అభివృద్ధినిరోధక చర్చిల్ వ్యూహాన్ని పూర్తిగా బలపరచి, సోవియట్ యూనియనును బలహీనపరచడానికి ప్రబలంగా ప్రయత్నించారు :

యుద్ధకాలంలో డొమినియనులలోని మితవాద లేబరువాదులు బ్రిటిషు అమెరికన్ పెట్టుబడిదారుల ప్రయోజనాలకోసం అమితమైన విధేయతతో కృషిచేశారు. గుత్త పెట్టుబడిదారులు విపరీతమైన లాభాలను గుంజుకోవడానికి సహాయపడ్డారు. కాని అదేసమయంలో తమజీతాలను హెచ్చించమనీ, సాంఘిక సంస్కరణలను ప్రవేశపెట్టమనీ డిమాండుచేసిన కార్మికుల గొంతును, అవి యుద్ధప్రయత్నాలకు భంగంవాటిల్లుతుందనే సాకుతో అణచివేశారు.

రెండో ప్రపంచయుద్ధం ముగిసిన తరువాత బ్రిటన్‌లోనూ, డొమినియన్‌లలోనూ వున్న లేబరు పార్టీలు "సామ్రాజ్యవాదం లేని సామ్రాజ్యం" అనే కొత్త నినాదాన్ని లేవదీశారు. కాని వాస్తవానికి వారు కన్సర్వేటివ్‌ల సామ్రాజ్యవాద పాలసీనే కొనసాగించుతూ, "సామ్రాజ్య రక్షణ" అనే తమ నూతన విధానాన్ని ఆచరణలో పెట్టడం ప్రారంభించారు. దీని దురాక్రమణ ఆశయాలు అందరికీ స్పష్టంగా విదితమే.

ఈ నూతన సామ్రాజ్య యుద్ధపథకాన్ని 1946 ఏప్రిల్‌లో లండన్‌లో జరిగిన అనధికార ఇంపీరియల్ కాన్ఫరెన్సులో చర్చించారు. ఈ పథకం యొక్క ప్రత్యేక స్వభావమేమంటే యిది బ్రిటిషు సామ్రాజ్యంలోని సాయుధబలాలను నూతన పద్ధతులలో సమీకరణ చేస్తుంది. అంతేకాక యిది డొమినియనులపై ప్రత్యేక దృష్టి వుంచుతుంది. ఈ ప్లాను ప్రకారం మూడు యుద్ధకేంద్రాలను నిర్మిస్తారు. పశ్చిమ కేంద్రం కెనడాలో, దక్షిణ కేంద్రం దక్షిణాఫ్రికా యూనియనులో, పసిఫిక్ కేంద్రం ఆస్ట్రేలియాలోనూ వుంటాయి. వీటిమధ్య సామ్రాజ్యంలోని యావత్తు పారిశ్రామిక, మనుష్య సంపత్తి విభజించబడుతుంది.

ఈ రకంగా యుద్ధ పరిశ్రమలనూ, సాయుధ బలాలనూ విభజించడం డొమినియనుల యుద్ధ, ఆర్థిక సంపత్తి హెచ్చడంవల్లనే

గాక యుద్ధవ్యూహానికి భౌగోళి కంగా వున్న సదుపాయాలవల్ల కూడా జరిగింది. కెనడా, ఆస్ట్రేలియా, దక్షిణాఫ్రికాలలోని మనుష్య నివాసంలేని విశాల భూభాగాలు ఆధునిక మారణ యంత్రాలను పరీక్షించుకోడానికీ సైన్యాలను తర్ఫీదు చేసుకోడానికీ ఉద్దేశించబడ్డాయి. అంతేకాక పెద్ద ఎత్తున మానవులను నాశనం చేసే అధునాతన మారణ యంత్రాల రహస్యాన్ని యీ ఎడారులలో అయితే బాగా కాపాడుకోవచ్చునని యుద్ధోన్మాదులు ఆశించుతున్నారు. ఆఫ్రికాను పదాతి సైన్యాలను తయారుచేయడానికి ఒక కేంద్రంగా అభివృద్ధి చేయాలనీ, అక్కడ నావికా, వైమానిక కేంద్రాలనుకూడా నిర్మించాలని 1946 లోని సామ్రాజ్య యుద్ధప్లాను నిర్దేశించింది. మెడిటరేనియను ప్రాంతంలో బ్రిటను స్థితిని దృష్టిలో వుంచుకొని, సమీప, మధ్యప్రాచ్యాలలోని జాతీయ విముక్తి ఉద్యమాలను అణచివేసే వుద్దేశ్యంతోనే యీ వ్యూహమంతా పన్నబడింది. ఇదంతా బ్రిటిషు పత్రికల వ్రాతలలోనే బయటపడింది. బ్రిటిషు మిలిటరీవేత్తలు తమ మెడిటరేనియను యుద్ధ వ్యూహంలో ఆఫ్రికా ఖండంలోని సమీప ప్రాంతాలను కూడా చేర్చడానికి ప్రయత్నిస్తున్నారు.

బ్రిటన్‌లోని లేబర్ ప్రభుత్వం యీ సామ్రాజ్య యుద్ధప్లానులోకి డొమినియన్‌లను యీడ్వాలని ప్రయత్నించారు. కాని అమెరికా వొత్తిడి ఫలితంగా కొన్ని డొమినియన్‌లు యీ ప్లానును పరిశీలించడానికి నిరాకరించుతూ, "సామ్రాజ్యరక్షణ" ప్లానులో ఉద్దేశించిన కేంద్రీకృత విధానాన్ని వ్యతిరేకించాయి. ముఖ్యంగా ఈ ప్లానును కెనడా, దక్షిణాఫ్రికాలు వ్యతిరేకించాయి. ప్రతిడొమినియన్ తనకు దగ్గరలోవున్న సామ్రాజ్య ప్రాంతాలకు రక్షణ బాధ్యతను వహించాలని యీ రెండు దేశాల ప్రతినిధులూ పట్టుపట్టారు. బ్రిటిషు ప్లానుకు కొన్నిమినహాయింపులతో ఆస్ట్రేలియా, న్యూజీలాండుల లేబరు ప్రభుత్వ ప్రధానులు తమ అంగీకారాన్ని తెలిపారు. ఈ సందర్భంలో బ్రిటిషు లేబరు ప్రభుత్వంతో ఆస్ట్రేలియా, న్యూజీలాండుల లేబరు ప్రధానుల సహకారం తమ పార్టీల సంబంధ

బాంధవ్యాలను బట్టి మాత్రమే అని తలచరాదు. ఇందుకు వేరే ప్రత్యేక కారణం లేకపోలేదు. ఆస్ట్రేలియా న్యూజీలాండు లు యితర డొమినియన్‌లకంటే మరి కొంత ఎక్కువగా బ్రిటిషు పెట్టుబడిపై ఆధారపడతాయి. అందుకనే వారు మధ్యధరాసముద్రంలోని రాకపోకల సౌకర్యాలను వినియోగించుకోడానికి కొంతవరకు బ్రిటన్ అడుగు జాడలలో నడవడానికి అంగీకరించుతాయి.

కాని యింతమాత్రం చేత బ్రిటిషు లేబరుపార్టీకి డొమినియనులలోని లేబరు పార్టీలకూ నిర్మాణరీత్యా, రాజకీయరీత్యా వున్న సన్నిహిత సంబంధాల ప్రాముఖ్యతను పూర్తిగా గమనించకపోతే పొరపాటవుతుంది. డొమినియనుల లేబరు పార్టీల నాయకులు చాలమంది బ్రిటను నుండి దిగుమతి అయినవారే బ్రిటిషు లేబరుపార్టీ చే సృష్టించబడినవారే. అందువలన వారు బ్రిటిషు లేబరుపార్టీ నాయకులతో సన్నిహిత సంబాధాలను వుంచుకొంటారు. ఇదేకాక డొమినియనుల నుండి అనేకమంది రాజకీయ వర్కర్లూ, వ్యాపారస్తులూ బ్రిటనుకు తరలివచ్చి అక్కడ ప్రధాన స్థానాలను ఆక్రమించారు. ఉదాహరణకు లార్డు బీవర్‌బ్రూక్ కెనడా నుండి వలస వచ్చాడు. అలాగే కెనడా మాజీప్రధాని లార్డు బెన్నెట్, ఆస్ట్రేలియా మాజీ ప్రధాని లార్డు బ్రూస్ వగైరా. లేబరు ప్రభుత్వాలు అధికారంలో వున్న ఆస్ట్రేలియా, న్యూజీలాండులలోనేగాక కెనడా, దక్షిణాఫ్రికాలలో కూడా బ్రిటిషు లేబరు ప్రభుత్వానికి నమ్మకమైన ఏజెంట్లున్నారు. నేటి బ్రిటిషు ప్రభుత్వం డొమినియనులలోని లేబరుపార్టీలపై ఆధారపడుతోంది. కెనడా దక్షిణాఫ్రికాలలో శ్రామిక ప్రజల ఉద్యమం నానాటికి అభివృద్ధి చెందడం మూలంగానూ, వర్గపోరాటం తీవ్రం అవడం మూలంగానూ సంభవిస్తూన్న సంక్షోభాన్ని తట్టుకోడానికి పాత బూర్జువాపార్టీలూ, గుత్తపెట్టుబడిదారులూ రోజురోజుకు లేబరు పార్టీలోని మితవాద నాయకులను తమ గులాములుగా వినియోగించుకోవలసి వస్తోంది.

కెనడా దక్షిణాఫ్రికాలలో గుత్తపెట్టుబడిదారులు రాజ్యాధికారాన్ని లేబరు నాయకులకు

అప్పజెప్పకుండా తామేస్వయంగా నియంతృత్వాన్ని చెలాయించగల స్థితిలో యింకా ఉన్నారు. బ్రిటన్ ఆస్ట్రేలియా న్యూజీలాండ్‌లలోని మితవాద లేబరు నాయకులు అనుసరించే అభివృద్ధి నిరోధక పాలసీ కెనడా దక్షిణాఫ్రికాలలోని పాలక వర్గాలకు లేబరువాదులలో నమ్మకాన్ని కలిగిస్తోంది. డొమినియన్‌లలో యీ విధంగా లేబరిజం వ్యాపించడం యీ దేశాలలో పాతబూర్జువా పార్టీల రాజకీయ ఆధిక్యతకున్న పునాదిని స్పష్టంగా తెలియపరుస్తోంది.

* * *

బ్రిటిషు డొమినియన్‌లలో చాలాకాలంవరకూ బూర్జువాజీ తన నియంతృత్వాన్ని ప్రధానంగా *"లిబరలిజం" పద్ధతుల ద్వారా చెలాయించింది. ఈ 'లిబరలిజం' లేబర్ ఉద్యమంలో సంస్కరణ తత్వాన్ని పోషించి బలపరచింది. ఆరోజుల్లో డొమినియనులను 'సముద్రాంతర బూర్జువా ప్రజాతంత్రాని'కి ప్రమాణ దేశాలుగా పరిగణించేవారు. ఈ దేశాలలో సామ్రాజ్యవాదుల ప్రధాన పాలసీని లిబరల్ పార్టీలూ, లేబరు పార్టీలలోని అగ్రనాయకులూ కొనసాగించుతూ వుండేవారు. లిబరల్ పార్టీకి, లేబరుపార్టీ అగ్ర నాయకులకు అట్టే భేదం వుండదు. పాత బూర్జువా పార్టీల పలుకుబడి సన్నగిలి పతన మవుతున్నకొద్దీ మితవాద లేబరుపార్టీ వాదులు ప్రాముఖ్యతకు రావడం ప్రారంభించారు.

పెట్టుబడిదారీ విధానంలో సర్వతోముఖ సంక్షోభం ప్రవేశించినదశలో డొమినియన్‌లలోని లిబరలిజం రోజురోజుకు ప్రత్యక్ష నిరంకుశత్వానికీ, బూటకపు సంస్కరణల వాగ్దానాలకు స్థానం యివ్వడం ప్రారంభమైంది. అయినప్పటికీ రెండో ప్రపంచ యుద్ధానికి ముందు డొమినియన్‌లలోని లేబరుపార్టీల నాయకులు బ్రిటిషు సామ్రాజ్యవాదం ముందు తమ లొంగుబాటు తనాన్ని కప్పిపుచ్చుకోడానికి ప్రయత్నించి, డొమినియనుల స్వేచ్ఛా స్వాతంత్ర్యంలకోసం పోరాడే యోధుల ముసుగును ధరించ యత్నించారు. యుద్ధం అయిపోయిన తరువాత పెట్టుబడిదారీ విధానంలో సర్వవ్యాపిత సంక్షోభం తీవ్రతరమైన

* "లిబరలిజం" పైకి ఉదారస్వభావాన్ని కనపరచే తత్వం.

ఫలితంగా డొమినియనులలోని మితవాద లేబరువాదులు శ్రామిక ప్రజలపై దాడికి నాయకత్వం వహిస్తున్న సామ్రాజ్యవాద అభివృద్ధి నిరోధక శక్తులతో పూర్తిగా ఏకమయ్యారు. ఇంతేకాక, బ్రిటీషు సామ్రాజ్య వాదం బలహీన పడిపోవడాన్ని గుర్తించి, డొమినియనులలోని ప్రజాతంత్ర శక్తులనూ, వలసదేశాల ప్రజలజాతీయవిముక్తి ఉద్యమాలను అణచివేయడానికి తగినంతగా ఉపయోగ పడదని గ్రహించి వారు అమెరికా సామ్రాజ్యవాదుల పాద సేవ చేయడం ఆరంభించారు. మితవాద లేబరువాదులు అమెరికా నుండి వచ్చే "సహాయం"పై నమ్మకాన్ని పెట్టుకొని "మార్షల్ ప్లాను"ను ఉత్సాహంతో బలపరచేవారుగా తయారయ్యారు. బ్రిటిషు గుత్త పెట్టుబడులను సంరక్షించుకొనే ఉద్దేశ్యంతో తమదేశాలను అమెరికా సామ్రాజ్యవాదుల ఆర్థిక రాజకీయ బానిసత్వానికి అప్పగించడానికి సిద్ధపడ్డారు. "ప్రజాతంత్ర సోషలిజం" అన్న ముసుగుక్రింద ఆంగ్లో-అమెరికను సామ్రాజ్యవాద కూటమియొక్క అభివృద్ధినిరోధక పాలసీని కొనసాగించుతున్నారు. దీనినంతటినీ దృష్టిలో వుంచుకుంటేనే వివిధ డొమినియనులలోని మితవాద లేబరు నాయకుల పాలసీలోని చిత్ర విచిత్ర ప్రత్యేకస్వభావాన్ని అర్థంచేసుకోడానికి వీలవుతుంది.

పెట్టుబడిదారీ ప్రపంచంలోని దేశాలన్నింటికంటే అధికంగా ఆస్ట్రేలియా రాజకీయ చరిత్ర లేబరుపార్టీ ట్రేడ్‌యూనియన్‌ల కార్యకలాపాలతో సంబంధాన్ని కలిగిఉంది. ఆస్ట్రేలియాను "ట్రేడ్ యూనియన్‌ల ఖండం" అనికూడా పిలుస్తారు. ఆస్ట్రేలియాలోని 71 లక్షల జనాభాలోనూ 11 లక్షల మంది అంటే నూటికి 16 గురు ట్రేడ్‌యూనియనులలో సభ్యులుగావున్నారు. (బ్రిటన్‌లోనూటికి 14 గురు ట్రేడ్‌యూనియనులలో సభ్యులుగా వున్నారు) ట్రేడ్ యూనియనులలో పెద్దపెద్ద పరిశ్రమలలోని కార్మికులే గాక చిన్న చిన్న వర్కు-షాపులలోనూ, వ్యాపార సంస్థలలోనూ, ఆఫీసులలో పనిచేసేవారు కూడా సభ్యులుగా వున్నారు. వ్యవసాయ కార్మికులలో చాలభాగం కూడా ట్రేడ్‌యూనియనులలో వున్నారు.

వీరే ఆస్ట్రేలియా లేబరుపార్టీకి ప్రజా పునాదిగా వుంటారు.

బ్రిటనులోకంటే చాల ముందుగానే ఆస్ట్రేలియాలోని బూర్జువాజీకి లేబరుపార్టీ సాంఘిక పునాదిగా ఏర్పడింది. మొట్టమొదట్లో -1901 లో యీ డొమినియను-ఆస్ట్రేలియను యూనియను యేర్పడినప్పుడే లేబరువాదులను బూర్జువాజీ ప్రభుత్వ శాఖలలోకి తీసుకొన్నది. ఆస్ట్రేలియాలో ప్రభుత్వ శాఖలలోనూ, పరిపాలనా నిర్వహణ స్థానాలలోనూ తమకు నమ్మకంగా వుండతగిన ట్రేడుయూనియను మితవాద వర్గాన్ని పెద్ద బాహుళ్యం మీాదనే బూర్జువాజీ నిర్మించగలిగింది. లేబరువాదులు మొట్టమొదటసారిగా 1908 లోనే ఆస్ట్రేలియా మంత్రివర్గంలో చేరగలిగారు. ఆతరువాత వారు అనేక సంవత్సరాలు దేశాన్ని "పరిపాలించారు". 1941అక్టోబరు నుండి మళ్ళీ తిరిగి లేబరుపార్టీ వారు ఆస్ట్రేలియాలోని ప్రభుత్వాన్ని నడుపుతున్నారు.

1913 లో జరిగిన పార్లమెంటరీ ఎన్నికల సందర్భంలో ఆస్ట్రేలియానుగురించి వ్రాస్తూ లెనిన్ యిలాఅన్నాడు :

"ఆస్ట్రేలియాలోని లేబరుపార్టీ యితర దేశాలలో లిబరల్సు ప్రవేశపెట్ట దగిన సంస్కరణలను మాత్రమే ప్రవేశపెట్టగలిగింది. దేశానికంతటికి ఒకేరకమైన సుంకాలు, అలాగే దేశానికంతటికీ ఒకే రకమైన విద్యావిధానాన్ని గురించిన శాసనం, ఒకే రకమైన భూమిపన్ను విధానం, ఒకే రకమైన ఫాక్టరీ శాసనాలు."

లెనిన్ - కలెక్టడ్ వర్క్సు

యుద్ధకాలంలో కర్టిన్ లేబరు ప్రభుత్వం కార్మికవర్గ జీవన ప్రమాణం తగ్గించి, పారిశ్రామిక గుత్తపెట్టుబడిదారుల, పెద్దపెద్ద పశువుల వ్యాపారుల, పెట్టుబడిదారీ భూస్వాముల జేబులునింపే పాలసీని అనుసరించింది. ఆస్ట్రేలియా కమ్యూనిస్టుపార్టీ తాత్కాలిక ప్రధాన కార్యదర్శి ఆర్. డిక్సను ఉదహరించిన లెక్కల ప్రకారం లాభాలూ, వడ్డీలూ అద్దెలూ మొత్తం 1938-39 లో 35 కోట్ల 70 లక్షల పౌన్ల స్టర్లింగు 1945-46 కు 49 కోట్ల 30 లక్షల పౌన్ల స్టర్లింగుకు పెరిగింది. (కమ్యూనిస్టు రివ్యూ, అక్టోబరు 1947) యుద్ధం ముగిసిన తరువాత 1945 జులైనుంచి ఆస్ట్రేలియా లేబరు ప్రభుత్వం ప్రధాని ఛీఫ్లీ,

విదేశాంగమంత్రి ఇవాట్‌లనాయకత్వాన ఆట్లీ, బెవినుల ప్రభుత్వ అడుగుజాడల ననుసరిస్తూ ప్రజానీకాన్ని మోసపుచ్చే తలంపుతో "ప్రజాతంత్ర సోషలిజం" అనే ముసుగుక్రింద పెద్ద సంస్కరణల కార్యక్రమాన్ని ప్రకటించింది. ఈ కార్యక్రమం పేరుతో కార్మిక వర్గంపై దాడిని మరింత తీవ్రతరం చేసింది. నోట్ల ముమ్మరానికి వ్యతిరేకంగా పోరాటాన్ని సాగిస్తున్నామన్న పేరుతో ఆస్ట్రేలియాలోని మితవాద లేబరు నాయకబృందం తమ బ్రిటిషు సోదరుల ననుసరించి జీతాలను కోయడం ప్రారంభించింది. అసలే ధరలు చుక్కల కంటుకొంటున్న యీ రోజులలో ఆవిధానం కార్మికుల నిజవేతనాలను అకస్మాత్తుగా తగ్గించి వేశాయి. ఈరకమైన కార్మిక వర్గ వ్యతిరేక పాలసీ ఆస్ట్రేలియను పెట్టుబడిదారుల లాభాలనూ, ఆస్ట్రేలియా ఆర్థికరంగంలో ఆధిపత్యాన్ని చెలాయించుతున్న బ్రిటిషు, అమెరికను గుత్త పెట్టుబడిదారుల లాభాలనూ మరింత ఎక్కువగా పెంచింది.

కీలక పరిశ్రమలను జాతిపరం చేస్తానన్న ఆస్ట్రేలియా లేబరు నాయకుల వాగ్దానాలింకా కార్యరూపం దాల్చలేదు. 1945 వేసవిలో స్వదేశంలోని వైమానిక పరిశ్రమను మాత్రమే జాతిపరం చేయడంతో తృప్తిపడ్డారు. ప్రధాన పరిశ్రమలన్నింటినీ జాతిపరం చేయాలని కార్మికవర్గం చేసిన డిమాండ్లను ఆస్ట్రేలియా మితవాద లేబరునాయకులు అన్నివిధాలా విచ్ఛిన్నపరచారు.

1947 నవంబరులో ఎం తో కాలయాపన జరిగిన తరువాత పార్లమెంటు ప్రయివేటు బ్యాంకులను జాతిపరంచేసే శాసనాన్ని చేసింది. కాని యీ "జాతిపరం" చేయడంవలన పెట్టుబడిదారీ పరిపాలనకు ఏమాత్రం భంగం వాటిల్లలేదు. పైగా అది ఆస్ట్రేలియాలోని పెట్టుబడిదారుల స్థితి బలపరచే ఉద్దేశ్యంతో చేయబడింది. 1947 ఆగస్టు 15వ తేదీన ఎక్స్చేంజి మార్కెట్టులో వున్న రేటుప్రకారం బ్యాంకుల వాటాలను కొనడానికి ప్రభుత్వం సిద్ధపడింది. 1947 ఆగస్టు 16 వ తేదీన బ్యాంకులను జాతిపరం చేసే విషయాన్ని ప్రభుత్వం ప్రకటించింది. ఆసమయంలో ఎక్స్చేంజి మార్కెట్టులో వున్న రేటు చాల హెచ్చుగా వుంది.

జాతిపరం చేయబడిన బ్యాంకుల అసలు పెట్టుబడి మొత్తం 40 మిలియన్ పౌన్లుంటే ఎక్స్ఛేంజి మార్కెట్టు ధర 70 మిలియన్ పౌన్లుంది. ("రౌండ్ టేబిల్" డిసెంబరు 1947 పేజీ 503) ఈవిధంగా లేబరు ప్రభుత్వం బ్యాంకువాటాదారులకు చక్కని లాభసాటి బేరాన్ని సంపాదించడానికి సహాయపడింది.

కాని చివరకు యీ "జాతిపరం" చేయడంకూడా విఫలమైంది. విక్టోరియా, దక్షిణఆస్ట్రేలియారాష్ట్రాల లేబరు ప్రభుత్వాలూ, యింకా 11 ప్రయివేటు బ్యాంకులూ, బ్యాంకును జాతిపరంచేసిన శాసనాన్ని రద్దుచేయవలసిందిగా సుప్రీమ్‌కోర్టుకు అప్పీలుచేసినాయి. 1948 ఆగస్టు 11 తేదీన "రాజ్యాంగ చట్టానికి అనుగుణ్యంగా" లేదనే సాకుతో సుప్రీమ్‌కోర్టు జాతిపరం చేసిన శాసనాన్ని రద్దుపరచింది. ఈ శాసనాన్ని రద్దుచేయడంతో ఆగక సుప్రీమ్‌కోర్టు తన తీర్పులో ఆస్ట్రేలియాలోని ఏ పరిశ్రమనూ జాతిపరం చేయడానికి వీలులేదనీ, అలాంటి అధికారం ఏ ప్రభుత్వానికీ లేదని చెప్పివేసింది. ఈ విధంగా పరిశ్రమలను "జాతిపరం" చేయడానికి లేబరువాదుల ప్రయత్నాలు అంతమయ్యాయి.

ఆస్ట్రేలియాలోని "ప్రజాతంత్ర సోషలిజా"న్నే కొద్దిపాటి మార్పులతో 1935 నుండీ అధికారంలో వున్న న్యూజీలాండ్ లేబరు ప్రభుత్వం అక్కడ అమలు పరుస్తోంది. న్యూజీలాండ్ లేబరుపార్టీ వారు తమ ఎన్నికల కార్యక్రమంలో బొగ్గుగని పరిశ్రమను జాతిపరం చేస్తానని వాగ్దానం చేసింది. అయితే పీటర్ ఫ్రాజర్ ప్రభుత్వం ఆ వాగ్దానాన్నికూడా నెరవేర్చలేదు. కొన్ని బ్యాంకులను బూటకంగా జాతిపరం చేయడం తప్ప న్యూజీలాండ్ లేబరుపార్టీ వారు అంతకంటే ముందుకెళ్ళిందేమీలేదు.

కెనడాలో లేబరుపార్టీ పద్ధతులపై ఒకపార్టీ రాజకీయరంగంలోకి ఆస్ట్రేలియా, న్యూజీలాండ్ లలో కంటే ఎంతో ఆలస్యంగా ప్రవేశించింది. ఈ బ్రిటిష్ డొమినియన్‌లో యిప్పటివరకూ లిబరల్ కన్సర్వేటివ్ అనే రెండు బూర్జువా పార్టీలే రాజకీయరంగంలో ఆధిపత్యాన్ని చెలాయించుతున్నాయి. పెట్టుబడిదారీ విధానంలో వచ్చిన సర్వతోవ్యాప్తి సంక్షోభం, కెనడా

రెండు పార్టీలవిధానంలో సంక్షోభాన్ని తెచ్చిపెట్టింది. ఇది ప్రథమ ప్రపంచ యుద్ధానంతరమే బయట పడి 1929_33 ప్రపంచ ఆర్థిక సంక్షోభంతో మరింత తీవ్రతర మైంది. గోధుమధరలు విపరీతంగా పడిపోవడం దానితో రైతాంగం సర్వనాశనం కావడం, పట్టణాలలో నిరుద్యోగం, దారిద్ర్యం పెచ్చుపెరిగిపోవడం – యివన్నీ కెనడాలోని పాతరాజకీయ పార్టీల ప్రతిష్ఠను పూర్తిగా దెబ్బతీశాయి. గుత్తపెట్టుబడిదారుల దోపిడీకి వ్యతిరేకంగా జరిగే పోరాటంలో రైతులు చురుకుగా పాల్గొనకుండా చేసేందుకు కెనడా బూర్జువావర్గ ప్రతినిధులు కేపిటలిజాన్ని సంస్కరించడంద్వారా భద్రత ఏర్పడు తుందని రైతుల మనస్సులలో భ్రమలను కల్పించడానికి ప్రయత్నించారు. కెనడా బూర్జువావర్గం సంక్షోభ కాలంలోకూడా శ్రామిక జనసామాన్యాన్ని దోపిడీ చేసి అధిక లాభాలను సంపాదించింది.

ఆల్బర్టా రాష్ట్రంలో 'సోషల్ క్రెడిట్' పార్టీ ఏర్పడింది. ఈపార్టీ నాయకులు రైతుల అమాయకత్వాన్నీ అనుభవంలేనితనాన్నీ వినియోగించుకొని తామధికారం లోకి వస్తే రాష్ట్రంలోని ప్రతి ఒక్కరికీ నెలకు 25 డాలర్లు చొప్పున డివిడెండ్లను చెల్లించగల మని వాగ్దానాలుచేశారు. ఇంతే కాక యిందులో ఉత్సాహంగల కార్యకర్తలకు ప్రభుత్వం అప్పులు పెట్టుతుందని ఆశలుపెట్టారు. ఈ బూటక "ప్లానుల"తోపాటు సోషల్ క్రెడిట్ పార్టీ నాయకులు కేపిటలిస్టు వ్యతిరేక పదజాలన్ని బాగా ఉపయోగించారు. దీనం తటివలనా, ప్రజలకుపాతబూర్జువా పార్టీలలో నమ్మకం పూర్తిగా పోవడంవలనా 1935 ఆకురాలు కాలంలో జరిగిన ఎన్నికలలో సోషల్ క్రెడిట్ పార్టీ ఆరాష్ట్రంలో విజయం సంపాదించింది. అప్పటి నుండీ అది ఆ రాష్ట్రంలో చాల పలుకుబడిగల పార్టీగా అభివృద్ధి చెందింది. ఇంత జరిగినా ఆల్బర్టా రాష్ట్ర ప్రభుత్వం తాను చేసిన ఒక వాగ్దానాన్నికూడా నెరవేర్చ లేదు. కాని అది ఒకవిధంగా తన ప్రతిష్ఠను నిలబెట్టుకొనేందుకు ప్రయత్నించుతోంది. అదేమంటే రాష్ట్ర ప్రభుత్వ అధికారంలోలేని శాసనాలను చేస్తుంది. వాటిని డొమినియన్ ప్రభుత్వంరద్దుచేస్తుం దని ముందుగా తెలిసేతనతప్పేమీ

లేనట్లూ, తాను మాత్రం ప్రజలకు మేలుచేయాలనే ఉబలాటపడుతు న్నట్లు నటించడానికి యీ శాసనా లను చేస్తుంది

క్యూబిక్ రాష్ట్రంలో నేషనల్ యూనియన్ అనే ఫాసిస్టు కేథలిక్ సంస్థ పాత బూర్జువాపార్టీల పలుకు బడి పతనమవడాన్ని అవకాశంగా తీసుకొని పాలకపార్టీ స్థానాన్నుండి లిబరల్సును త్రోసివేసి తా నా స్థా నా న్ని ఆ క్ర మిం చు కోగలిగింది. ఈ సంస్థ యిప్పుడు ప్రజలలో వున్న కేపిటలిస్టు వ్యతి రేక భావాలను ఆధారం చేసు కొని దానిని సంకుచిత జాతీయ దోరణులతో త్రిప్పడానికి ప్రయ త్నించుతోంది. క్యూబిక్ రాష్ట్ర ములో మెజారిటీ ప్రజలుగా వున్న ఫ్రెంచివారిని ఇంగ్లీషువారికి వ్యతి రేకం గా ప్రయోగించుతోంది. పరిశ్రమలనుండి విదేశపెట్టుబడుల ఆధిక్యతను తొలగించాలనీ, పెద్ద "పెద్దవ్యాపార సంస్థలైన ట్రస్టుల" ను నిషేధించాలనీ పెద్దగా వట్టి బూటకపు నినాదాలను మాత్రం యిస్తుంది. ఈ నేషనల్ యూని యన్‌నాయకులే క్యూబిక్ కేథలిక్ రిపబ్లిక్ ఆఫ్ లారెన్సును నిర్మిం చాలని ప్రజలకు విజ్ఞప్తిచేస్తారు.

కెనడా లేబరుపార్టీ 1929–33 సంక్షోభ కాలంలో ఉత్పన్న మైంది. "ఇది ఫెడరేషన్ ఆఫ్ కోప రేటివ్ స్టేట్సు" అనీ, లేక సోషల్ డెమోక్రటిక్ పార్టీ అని పిలువ బడుతుంది. ఇది లిబరల్, కన్సర్వే టివ్ పార్టీలతోబాటు "మూడో పార్టీగా" దేశ వ్యాపితంగా గుర్తించబడింది. ఇతర లేబరు పార్టీలవలెగాక కెనడా సోషల్ డెమోక్రటిక్ పార్టీలో బూర్జువా మేధావులూ, ట్రేడ్ యూనియన్ అధికార వర్గం, యింకా యితర కా ర్మి కు ల తో పా టు చాల మంది రైతులు కూడా చేరారు. ఈ పార్టీ ని ర్మా ణం బాగా ధాన్యం పంట పండే కేంద్రమైన శాస్క్యచీవాన్ రాష్ట్రంలోని కెన డియన్ ప్రైరీస్‌జిల్లాలో ప్రారంభం కావడం గమనించతగ్గ విషయం.

1933 లో జరిగిన తన పార్టీ కాంగ్రెసులో ఆమోదించిన సోషల్ డెమోక్రటిక్‌పార్టీ కార్య క్రమం సాంప్రదాయ లేబరు పద్ధ తులకు ఆధారం చేసుకొనే తయారు చేయబడింది. పరిశ్రమ లనూ, ఆర్థిక సంపత్తినీ జాతి పరం చేయడం, రైతులకు భూమిని గ్యారంటీ చేయడం, కార్మిక

శాసనాలు చేస్తామనే వాగ్దానాలు, ప్రభుత్వ వైద్యసహాయం యింకా యితర సంస్కరణలను ప్రవేశ పెడతామనే వాగ్దానాలూ-వీటినే తన ఆశయాలుగా ప్రకటించింది. అచ్చంగా సంస్కరణపార్టీ అయిన యిది కేపిటలిజానికి ఏవిధంగానూ భంగకరం కాదు. పైగా శ్రామిక ప్రజలలో కేపిటలిజానికి "అభివృద్ధి చేయడం" సాధ్యమనే భ్రమలను కల్పించి, వారిని పోరాటం వైపుకు మొగ్గకుండా చేస్తుంది. పెట్టుబడిదారీ విధాన నిర్మాణంలోనే కోపరేటివ్ రాజ్యాన్ని నిర్మించగలమనే దీని ఉద్దేశ్యం కేపిటలిజానికి బాగా సరిపోతుంది.

పెట్టుబడిదారీ విధానం అమలులో వున్న పరిస్థితులలో సహకారసంస్థల నిర్మాణాన్ని పెద్దగా పొగడే అవకాశవాదులను బూర్జువా సంస్కరణ వాదులుగానూ కార్మికవర్గ విద్రోహులుగానూ, లెనిన్ అతితీవ్రంగా ఖండించాడు.

1944 లో సోషల్ డెమోక్రట్లు మొట్టమొదటి సారిగా శాస్కచీవాన్ రాష్ట్రంలో ప్రభుత్వానికి అధిపతులయ్యారు. రాష్ట్రశాసన సభాఎన్నికలలో అంతకు ముందు 40సంవత్సరాలుగా రాష్ట్రాన్ని పరిపాలిస్తున్న లిబరల్సును ఓడించి మొత్తం 52 స్థానాలలో 47 స్థానాలను గెలుపొందారు. ఇతరరాష్ట్రాలలోకూడా సోషల్ డెమోక్రట్లు కొంతవరకు విజయాన్ని సాధించగలిగారు. 1945 లో జరిగిన ఫెడరల్ పార్లమెంటు ఎన్నికలలో సోషల్ డెమోక్రట్లు నూటికి 20 స్థానాలను సంపాదించారు.

కెనడా సోషల్ డెమోక్రట్ల ఎన్నికల విజయాలు ప్రజానీకం వామపక్ష ధోరణికి మొగ్గుతున్నదని ఖచ్చితంగా సూచింపుతున్నాయి. పరిశ్రమలను జాతిపరం చేస్తామనీ, గుత్తపెట్టుబడిదారుల అధికారాలను పరిమితం చేస్తామని రైతులు పండించే ధాన్యాలకు ధరలకు గ్యారంటీ చేస్తామనీ మొదలుగాగల వాటిని సోషల్ డెమోక్రట్లు తమ ఎన్నికల వేదికపై ప్రచారం చేయడం దేశంలో తీవ్రమైన ప్రజాతంత్రకరమార్పులు కలగాలని, దరిద్రం, నిరుద్యోగం అంతమొందాలని సంక్షోభప్రమాదాన్ని దాటాలనే శ్రామిక ప్రజల గాఢమైన వాంఛను స్పష్టపరుస్తుంది. అమెరికాకు కెనడా ప్రభుత్వం కలుగజేస్తున్న విపరీతమైన సదుపాయాలను సోషల్ డెమోక్రటిక్ నాయకులు మాటలలో

తీవ్రంగా ఖండించారు. ఈవిధమైన తీవ్రఖండన వారికి ఎన్నికలలో విజయాన్ని సంపాదించడానికి సహాయపడింది.

కార్మికజనసామాన్యం వొత్తిడి చేసిన ఫలితంగా కెనడా ట్రేడ్ యూనియన్‌లు [కెనడాలో రెండు కేంద్ర ట్రేడ్‌యూనియన్ సంస్థలున్నాయి. 1 కెనడియన్ కాంగ్రెసు ఆఫ్ లేబర్ ఇందులో అమెరికాలో సి. ఐ. ఓ. ట్రేడ్‌యూనియన్ సంస్థలో అనుబంధ శాఖలుగా వున్న యూనియన్ లుంటాయి. 2 కెనడియన్ కాంగ్రెసు ఆఫ్ ట్రేడ్ యూనియన్స్ ఇందులోని యూనియన్‌లు అమెరికాలోని అమెరికన్ ఫెడరేషన్ ఆఫ్ లేబరు (ఎ. యఫ్. యల్.)తో అనుబంధించిఉంటాయి. ఈ రెండు సంస్థలోని యూనియన్‌లూ రాజకీయాలలో జోక్యం కల్పించుకోరాదనే సూత్రంపైననే నడుస్తున్నాయి]

అత్యంతప్రధానమైన పరిశ్రమలన్నింటినీ జాతిపరం చేయాలనీ, గుత్తపెట్టుబడిదారుల అధికారాన్ని పరిమితం చేయాలనీ మొదలు గాగల డిమాండ్లతో ముందుకు రావలసి వచ్చింది. సోషల్ డెమోక్రటిక్ పార్టీతో సన్నిహిత సంబంధం కలిగిన కెనడియన్ కాంగ్రెస్ ఆఫ్ లేబరు నాయకత్వం తన కార్యక్రమంలో బొగ్గుగనులను, బ్యాంకులను, రేడియోస్టేషన్లనూ జాతిపరం చేయవలసిందనే డిమాండ్లను జేర్చింది. కార్మికుల వొత్తిడి ఫలితంగా కెనడియన్ కాంగ్రెసు ఆఫ్ ట్రేడ్ యూనియన్స్ కూడా బ్యాంకులను, అప్పుపెట్టే సంస్థలనూ, ప్రజావసర సంస్థలన్నింటిని జాతిపరంచేయాలనీ కెనడాజాతీయ సహజసంపదపై ప్రభుత్వకంట్రోలు వుండాలని కోరింది.

ఆస్ట్రేలియా, న్యూజీలాండ్‌లలోవలె కెనడా సోషల్ డెమోక్రట్లు ఒక్క సాస్కచీవాన్ రాష్ట్రంలోతప్ప అధికారంలోకి రాలేదు. దీనిమూలంగా మితవాద లేబరువాదులు వాస్తవానికి గుత్తపెట్టుబడిదారులకు ఏజెంట్లుగా ప్రవర్తించుచుతూ, పైకి "వ్యతిరేకంగా" ఉన్నామనే ముసుగును ధరించడానికి వీలుకలిగింది. వ్యతిరేకపక్షంగా ముందుకొస్తూ వారు వట్టి శబ్దజాలంతో అభ్యుదయ భావాలుగల కెనడా ప్రజలను మోసగిస్తున్నారు. నిజానికి వారు డొమినియన్‌లలోని లేబరు ప్రభు

ల్వాలను ఆమోదించుతారు. బిటన్ కార్మికవర్గ ఆశయానికి ద్రోహంచేసి కార్మికోద్యమాన్ని చీల్చే పాలసీని అనుసరిస్తోంది. దానికికూడా కెనడా సోషల్ డెమోక్రట్లు సంపూర్ణంగా బలపరుస్తారు. కెనడాలోని లేబరు ప్రోగ్రెసివ్ పార్టీతో సహకరించడానికి కెనడా లేబరు వాదులు పూర్తిగా నిరాకరించడమేగాక పైపెచ్చు ఆ పార్టీని క్రూరనిర్బంధ విధానంతో వేటాడటానికి అభివృద్ధి నిరోధకులకు సహాయపడతారు.

శాక్ష్యచీవాన్ రాష్ట్రంలోని సోషల్ డెమోక్రటిక్ ప్రభుత్వం సోషల్ క్రెడిట్ పార్టీవలెనే తమ ఎన్నికల వాగ్దానాలను నెరవేర్చనందుకు "చట్టసంబంధమైన ఇబ్బందులను" సాకు చూపెట్టి తమ నిస్సహాయతను వెలుబుచ్చుతారు. ఇంతవరకు ఎన్నికలలో చేసిన ఒక్క వాగ్దానాన్నికూడా నెరవేర్చలేదు. సంఘు యాజమాన్యాన కొన్ని సంస్థలను ప్రోత్సహిస్తామని చెప్పి సోషల్ డెమోక్రటిక్ పార్టీ కెనడా రాజ్యాంగ చట్టానికి లోబడి ఏవో కొన్ని "సాంఘికవిజయాలను" మాత్రం శాక్ష్యచీవాన్ రాష్ట్రంలో సాధించారు.

రెండు అభివృద్ధి నిరోధక పార్టీలు - స్మట్సు యునైటెడ్ పార్టీ, మలాన్ నేషలిస్టు ఫాసిస్టు పార్టీ - పాలిస్తున్న దక్షిణాఫ్రికా యూనియన్‌లోకూడా ఇటీవలి సంవత్సరాలలో లేబరువాదుల పలుకుబడి హెచ్చుతోంది. కాని యితర డొమినియన్‌లతో పోల్చిచూస్తే వారిపలుకు అంతగాలేదు. 1943 ఆగస్టులో క్రింది శాసనసభా ఎన్నికలలో లేబరుపార్టీవారు మొత్తం 163 స్థానాలలోనూ తొమ్మిది మాత్రమే సంపాదించగలిగారు. లేబరుపార్టీ సంఖ్యారీత్యా చాల చిన్నదైనప్పటికీ దాని మితవాద నాయకులు పరిశ్రమలలోనూ, తాము మునిసిపల్ అధికారంలోకి వచ్చిన కోస్తాపట్టణాలలోనూ దక్షిణాఫ్రికా సామ్రాజ్యవాదులకు అత్యధికంగా సహాయపడుతున్నారు.

1948 జూన్‌లో జరిగిన ఎన్నికలలోకూడా పార్లమెంటులో లేబరుపార్టీబలం అధికం కాలేదు. లేబరుపార్టీవారు స్మట్సు పార్టీతో ఏకమై ఎన్నికలలో పోటీచేశారు. ఈ ఎన్నికల కూటమి మలాన్

ఫాసిస్టు ముళ్ళక్రింద ఓటమి తిన్నది. కమ్యూనిస్టుల పైనా, యితర ప్రజాతంత్ర వాదులపైనా మితవాద లేబరు నాయకుల మద్దత్తుతో స్మట్సు సాగించిన దారుణ నిర్బంధ విధానం ఫాసిస్టు మలాన్ అధికారంలోకి రావడానికి వినియోగపడింది.

దక్షిణాఫ్రికా లేబరు నాయకులు నగ్న స్వరూపంలో అనుసరించే జాతి విద్వేష పాలసీ లేబరువాదుల "ప్రజాతంత్ర సోషలిజం" యొక్క నిజస్వరూపాన్ని స్పష్టంగా చూపెడుతుంది. ఆంగ్లో-అమెరికన్ సామ్రాజ్యవాదులకు గులాములుగా పని చేసే యీ లేబరువాదులు తమ యజమానుల రక్షణ, వారి లాభాల రక్షణ సమస్య వచ్చినప్పుడు ఎంతటి నీచమైన మోసపు కృత్యాలకైనా దిగజారుతారు.

డొమినియన్‌లలోని లేబరు పార్టీల విదేశాంగ విధానం వారి ఆంతరంగిక పాలసీవలెనే ఆంగ్లో-అమెరికన్ సామ్రాజ్యవాదులనే అనుసరించుతోంది. బ్రిటన్ అమెరికాల మధ్య నాటకం ఆడుతున్న యీ మితవాద లేబరు నాయకులు రెండో ప్రపంచ యుద్ధం అనంతరం అమెరికా సామ్రాజ్యవాదం ముందు మోకరిల్లడం ప్రారంభించారు. ఈ విధంగా డొమినియన్‌లలోని లేబరు పార్టీలు బ్రిటిష్ డొమినియన్‌ల పైనే గాక యావత్తు బ్రిటిషు సామ్రాజ్యంపైనా అమెరికా సామ్రాజ్యవాదం కంట్రోలును సాధించడానికి సహాయపడుతున్నాయి.

* * *

బ్రిటిషు లేబరు నాయకులు అమెరికా సామ్రాజ్యానికి తాము లొంగిపోయిన విషయాన్ని తమ ప్రజలముందు కప్పిపుచ్చుకోనేందుకు ప్రయత్నించుతున్నారు. తమనాయకత్వాన బ్రిటన్ రెండు "తీవ్రవైఖరులైన" సామ్రాజ్యవాదానికి కమ్యూనిజానికి మధ్య "మూడో పంథా" అనుసరించుతుందని చెప్పుకొంటారు. వాస్తవానికి యీ "మూడో పంథా" బ్రిటిషు లేబరు నాయకులు అనుసరించే అమెరికా అనుకూల పాలసీకి ఒక ముసుగు మాత్రమే. ఈ పంథా యూరప్‌లోని మితవాద సోషలిస్టుల సహాయంతో అమెరికా గుత్త పెట్టుబడిదారులు [illegible] సహా యూరప్‌ను

ఆర్థికంగా, రాజకీయంగా బానిసత్వంలో ముంచడానికి చక్కని అవకాశాన్ని కలిగిస్తుంది. మరొక నూతన యుద్ధ కార్యక్రమానికి బాటను పరిచేస్తుంది.

బ్రిటిష్ సామ్రాజ్యంలోని డొమినియన్‌ల మితవాద లేబరు వాదులు సరిగా యిలాంటి పాత్రనే నిర్వహించుతున్నారు. బ్రిటన్‌కూ అమెరికాకు మధ్య "లింకుగా" వ్యవహరించ గలిగితేనే తమ స్వాతంత్ర్యాన్ని రక్షించుకోగలమని సాకుచెప్పి వారు తమ జాతీయ విద్రోహాన్ని కప్పిపుచ్చుకొంటారు. దానినే మరొక మాటలో చెప్పాలంటే—తమ దేశాలలో అమెరికా పెట్టుబడులను ప్రోత్సహించడం ద్వారా బ్రిటన్ చెప్పు చేతులలో వుండటం తగ్గిపోతుందనీ, అంతే కాక ఆంగ్లో-అమెరికన్ సంబంధాలలో తాము స్వతంత్ర మధ్యవర్తులుగా వుండగలమనీ తమ ప్రజలను మోసపుచ్చుతున్నారు. ఉదాహరణకు కెనడా సోషల్ డెమోక్రట్ల నాయకుడైన కాల్డవెల్ "కెనడాలో కల్లా కోపరేటివ్ ఫెడరేషను ఒక్కటే పాన్ (విశాల) అమెరికా యూనియన్‌లో కెనడా చేరడానికి ఆమోదిం... గొప్పగా చెప్పుకొన్నాడు. 'పాన్ అమెరికా యూనియన్'లో సభ్యురాలుగా చేరడంవలన తన బ్రిటిష్ కామన్‌వెల్తు సభ్యత్వానికి ఎలాంటి భంగం కలుగదని తాను భావిస్తున్నట్లు కూడా ప్రకటించాడు. (జె డబ్ల్యూ. కాల్డవెల్—లెఫ్ట్‌టరన్ 1945, పేజీ 30)

కెనడా సోషల్ డెమోక్రట్ల వలెనే యితర అమెరికాసామ్రాజ్యవాద ఏజెంట్లు అమెరికా పెట్టుబడులను ఆహ్వానించడం మూలంగా కెనడా స్వాతంత్ర్యానికి గ్యారంటీ వుంటుందని బహిరంగంగా ప్రకటించారు. "కెనడాలో అమెరికా పెట్టుబడులు విరివిగా వుండటమే భవిష్యత్తు కెనడా రాజకీయ స్వాతంత్ర్యానికి ఉత్తమోత్తమ గ్యారంటీ"—మెక్రీ డెన్నిసన్, కెనడా అవర్ డొమినియన్ నైబర్, న్యూయార్కు ఫారిన్ పాలసీ అసోషియేషన్, 1944, పేజి 61.

కెనడాలోని దాదాపు సగం పరిశ్రమలు అమెరికా గుత్త వ్యాపార కంపెనీలకు చెందినవే. కెనడా పరిశ్రమలలో అమెరికా పెట్టుబడు లుండటంవలన కెనడాలో ఆర్థికంగా, రాజకీయంగా పరిమితిలేకుండా అమెరికా విస్తరణ చెందడానికి సహాయపడు

తుంది. కెనడాలోకి అమెరికా మరింతచొచ్చుకుపోవడానికి వీలవుతుంది. దానిఫలితంగా కెనడా ఆర్థికవిధానాన్ని అమెరికన్లు స్వాధీనంచేసుకోవడం, ఆతరువాత యీ బ్రిటిష్ డొమినియన్ నానాటికి అమెరికా గుత్తపెట్టుబడిదారీ చక్రవర్తుల బానిసత్వంలో పడిపోవడం సంభవిస్తుంది.

కెనడాలో ఎక్కువెక్కువగా అమెరికా తన పెట్టుబడులను పెట్టడం కెనడా మార్కెట్టును స్వాధీనంచేసుకోవడానికి మాత్రమే గాక, బ్రిటిష్ సామ్రాజ్యంలోని యితర మార్కెట్టులలోకి వ్యాపించడానికికూడా ఉద్దేశ్యపడుతోంది. కెనడాలో అమెరికా కంపెనీ శాఖలచే తయారుచేయబడిన వస్తువులపై "కెనడాలో తయారుచేయబడిందని" వ్రాసి ఉంటుంది. ఇందువలన కెనడా పేరుతోవున్న అమెరికా సరకు యితర బ్రిటిష్ డొమినియన్లకు రవాణాచేయడానికి చక్కటి సదుపాయం ఏర్పడుతుంది. ఎందువల్లనంటే సామ్రాజ్యంలో డొమినియన్ల సరకులకు తక్కువ సుంకాలు మాత్రమే విధించబడతాయి. ఈ విధంగా అమెరికా సరకులు సామ్రాజ్యంలోని యితర డొమినియనుల మార్కెట్టులలోకి తేలికగా చొచ్చుకొని పోయే అవకాశం లభించుతుంది.

కెనడాలో అమెరికా పెట్టుబడుల విస్తరణ కెనడా స్వతంత్ర ప్రతిపత్తి బలపడేందుకు సహాయపడదు పైగా దీనిమూలంగా కెనడా రోజురోజుకూ అమెరికా సామ్రాజ్యవాదంపై ఆధారపడవలసివస్తోంది. కెనడా ఆర్థికవిధానంలోకి అమెరికా పెట్టుబడి ప్రవేశించడంవలన అసమానత్వంగా అభివృద్ధి జరిగి చివరకు కెనడా అమెరికా ఆర్థికవిధానానికి ఒక అంగంలాగా తయారైంది.

అమెరికా గుత్తపెట్టుబడిదారులు తమకు లాభకరంగా వుండే పరిశ్రమలను మాత్రమే ప్రోత్సహించి, అసలు ఆదేశ ప్రయోజనాల దృష్ట్యా లాభకరమైన యితర ముఖ్య పరిశ్రమల అభివృద్ధికి ఆటంకాలను కలుగజేస్తారు. తనకు కావలసినంత బొగ్గు, ఆయిల్, ఇనుము రిజర్వు లుండికూడా, వీటినే చాలవరకు కెనడా అమెరికానుండి దిగుమతి చేసుకోవలసి వస్తోంది. అమెరికా కంపెనీల శాఖలైన కెనడా ఫ్యాక్టరీలు, ప్రతి చిన్న యంత్రానికీ అమెరికా మీదనే పూర్తిగా ఆధారపడవలసి వచ్చే పరిస్థితులు

కల్పించారు. కెనడా తన శ్రేయస్సుకు వ్యతిరేకమైన వ్యాపార సంబంధాలను అమెరికాతో కలిగి ఉంది. డాలర్ల కొరతవలన బాధపడవలసిన పరిస్థితులు అధికమవుతూ వుంటాయి. అందువలన కెనడాలోకి మరింత ఎక్కువగా అమెరికా పెట్టుబడులను ఆహ్వానించవలసివస్తోంది.

అమెరికా పెట్టుబడుల దురాక్రమణ స్వభావాన్నీ దాని ఫలితంగా కెనడాకు సంభవించే దుష్ఫలితాలూ కప్పిపుచ్చడానికి కెనడా లేబరుపార్టీ తన యావత్తు శక్తినీ వినియోగించుతోంది. కెనడాలో జరుగుతున్న యీ సంఘటనలు ఆర్థిక రంగంలో పెత్తనం చెలాయించే గుత్తపెట్టుబడి వర్గాలు తప్పనిసరిగా అదేరకమైన తీవ్ర దురాశ దోపిడీ పద్ధతులను రాజకీయ రంగంలో కూడా అనుసరిస్తారన్న లెనిన్ సిద్ధాంతానికి చక్కటి నిదర్శనం. "అమెరికా ట్రస్టులఅభ్యుదయపాత్ర"నుగురించీ అమెరికా బ్రిటన్‌ల మధ్య "లింకు"గా పనిచేయడం వల్ల కెనడాకు లభించే సదుపాయాలను గురించీ కెనడా మితవాద సోషలిస్టులు మోసపు ప్రకటనలను చేస్తున్నారు. ఈ విధానం ఆచరణలో కెనడా అమెరికా సామ్రాజ్యవాదానికి ఒక అంగంగా తయారవడం, ఆ తరువాత కెనడా బానిసత్వంలో ముంచబడి అణచబడటానికి మాత్రమే సహాయపడుతుంది.

కెనడాలోని అమెరికా గుత్తపెట్టుబడిదారుల "శాంతియుత" విస్తరణ రెండో ప్రపంచ యుద్ధానంతరం యితర దేశాలతోవలెనే దౌర్జన్య పద్ధతులను అవలంబించింది. ప్రస్తుతం అమెరికా సామ్రాజ్యవాద విస్తరణ ఆర్థిక, మిలిటరీ, రాజకీయ రంగాలలో తీవ్రదోపిడీ పద్ధతులలో జరుగుతూ వుంది. కెనడాను తమ మిలిటరీ వ్యూహ కేంద్రంగా మార్చుకొనేందుకు అమెరికా సామ్రాజ్యవాదులు ఉద్దేశించుతున్నారు. యుద్ధకాలంలో అమెరికా సామ్రాజ్యవాదులు కెనడా భూప్రాంతం గుండా అమెరికానూ అలాస్కాను కలిపే ఒక మిలిటరీ ట్రంకురోడ్డు నిర్మించారు. ఈ రోడ్డు వెంట అనేక మిలిటరీ కేంద్రాలను నిర్మించి, అక్కడ తమ సైన్యాలనుకూడా ఉంచారు. యుద్ధం ముగిసిన తరువాత

అప్పుడు చేసుకొన్న ఒడంబడికను ఉభయుల "రక్షణ"కనే పేరుతో పొడుగించేటట్లు అమెరికా చేసింది. 1947 ఫిబ్రవరి 12 వ తేదీన ప్రకటించబడిన యీ ఒడంబడికలో కెనడా ఆయుధాలను అమెరికన్ మోడల్‌లో తయారు చేయాలనీ, అమెరికన్ సైన్యాలు కెనడాలో నిలవుంచాలనీ, అక్కడ నూతన అమెరికా యుద్ధ కేంద్రాలను నిర్మించాలనీ, కెనడా మిలిటరీ ప్లానులన్నీ అమెరికా మిలిటరీ అధికారులకు లోబడి వుండాలనీ ఉదహరించబడి వుంది. అంతే కాదు; కెనడా ప్రభుత్వం కెనడాలోని అమెరికా మిలిటరీకి విపరీతమైన హక్కు లిచ్చింది. కెనడాలోని అమెరికా ఆఫీసర్లూ, సైనికులూ కెనడా న్యాయస్థానాలకు గాక అమెరికా న్యాయాధికారులకే జవాబుదారీ వహిస్తారని కెనడా ప్రభుత్వం ఒక శాసనాన్ని కూడా ఆమోదించింది.

కెనడాలో అమెరికా యుద్ధోన్మాదులు యీరకంగా అంతులేని మిలిటరీ వ్యూహాలకు సంబంధించిన కార్యకలాపాలు చేయగలగడం బ్రిటీషు సామ్రాజ్యం స్థితి విపరీతంగా బలహీన పడటం మూలంగానే. ఇది ఆంగ్లో-అమెరికన్ వైరుధ్యాలు తీవ్రతర మవడాన్ని సూచించుతుంది. రెండో ప్రపంచ యుద్ధం జరుగుతున్న క్లిష్ట పరిస్థితులలో బ్రిటన్ తన డొమినియన్లను బ్రిటిషు సామ్రాజ్య రక్షణకు ద్వితీయ రక్షణ శ్రేణిగా పరిగణిస్తే అమెరికా పాలకవర్గాలు వాటిని బ్రిటిష్ సామ్రాజ్యంపై వొత్తిడి తేవడానికి, తమ దురాక్రమణ ఆశయాలను సాధించుకోడానికీ ప్రధమ స్థానాలుగా పరిగణించాయి.

సరిగ్గా రెండో ప్రపంచయుద్ధం జరుగుతున్న కాలంలోనే బ్రిటన్ తన సామ్రాజ్యాన్నే కాక, చివరకు తన స్వదేశాన్నికూడా యితరుల సహాయం లేకుండా కాపాడుకోలేదని స్పష్టమైనప్పుడు బ్రిటన్ యొక్క యీ బలహీనతను అమెరికా అవకాశంగా తీసుకొని బ్రిటిష్ స్వాధీనంలోని కెనడా సమీపంలోని ప్రాంతాలనన్నింటినీ 99 సంవత్సరాలకు అద్దెకు–అంటే ఆచరణలో శాశ్వతంగా స్వాధీనం చేసుకొన్నది. యుద్ధానంతరం బ్రిటన్ మరింత బలహీన పడింతరువాత సహజంగా కెనడా ప్రాంతాన్నంతటినీ స్వాధీనం చేసు

కొనే విషయం ఏజెండాలోకి వచ్చింది. "ఇద్దరు యజమానులకు సేవకులు"గా వ్యవహరించే నిపుణత్వాన్ని చాలకాలంగా గడించి, అందులో ప్రావీణ్యాన్ను బడసిన కెనడా అభివృద్ధి నిరోధకవర్గాల పాత్రకూడా యీ స్థితికి దిగజారడానికి చాలవరకువినియోగపడింది. ఈ విధంగా కెనడాలోకి "శాంతి యుతంగ" ప్రవేశించిన అమెరికా పెట్టుబడి [దీనినే "అమెరికా జీవిత విధానం"తో కెనడా ప్రజలను ఐక్యంచేసిందని కెనడా సంస్కరణ వాదులు విపరీతంగా గొప్పచెప్పకొంటారు.] కెనడా పూర్తిగా అమెరికా ఆధిపత్యంక్రిందకు పోయేటట్లు చేసింది

ఆస్ట్రేలియా, న్యూజిలాండ్ మితవాద లేబరు నాయకులుకూడా అమెరికా గుత్తపెట్టుబడిదారులకు విధేయతగావుండే సేవకపాత్రను నిర్వహించాలని ఉబలాటపడ్డారు. రెండో ప్రపంచయుద్ధ ప్రారంభ దశలోనే వారు అమెరికా మిలిటరీ సహాయాన్ని జపానుకు వ్యతిరేకంగానే కాకుండా తమ తమ దేశాలలోని ప్రజలనోపాగిన్ను౦డి ఆస్ట్రేలియా న్యూజిలాండ్ల కేపిటలిజాన్ని సంరక్షించుకోడానికికూడా వినియోగించుకొన్నారు. యుద్ధకాలంలోనే అమెరికా బడాపెట్టుబడిదారీ సంస్థలు ఆస్ట్రేలియా, న్యూజిలాండ్ మార్కెట్లలో ప్రత్యేకశ్రద్ధ తీసుకొని అంతకుముందు బ్రిటిష్ అమెరికా కంపెనీలకు చెందిన వాటాలను స్వాధీనం చేసుకొన్నాయి.

ఆస్ట్రేలియా, న్యూజిలాండ్లలో యుద్ధకాలంలో స్వాధీనం చేసుకొన్న యుద్ధవ్యూహాలకు సంబంధించిన స్థానాలను అమెరికా సామ్రాజ్యవాదులు యుద్ధానంతరంకూడా అలాగే తమ స్వాధీనంలో అట్టేపెట్టుకొన్నారు. ఆస్ట్రేలియా, న్యూజిలాండ్ వాటి చుట్టూవున్న దీవులు - న్యూ కాలిడోనియా, అడ్మిరాలిటీ దీవులూ, న్యూహెబ్రిడ్స్ - అన్నింటినీ అమెరికా పసిఫిక్ మహాసముద్రంలో తన దక్షిణ రక్షణశ్రేణిగా పరిగణించుతున్నదని అమెరికా రాజకీయ నాయకులు స్పష్టంగా ప్రకటించారు. అమెరికా మిలిటరీ వేత్తల ఈ దురాక్రమణ ప్లానులు ఆస్ట్రేలియాలో తీవ్రమైన అడజడికి దారితీసింది.

ఆస్ట్రేలియానుగురించి అమెరికా సామ్రాజ్యవాదులు చేస్తున్న

యీ ప్రకటనల సందర్భంలో 1946 ఆఖరు కాలంలో ఆంగ్లో-ఆస్ట్రేలియాల సహకారం వృద్ధి పొందాలనే ధోరణి కొన్ని వర్గాలలో ప్రబలమైంది. సరిగ్గా యిదే సమయంలో జపాన్ సమస్యపై జరిగిన మిత్రరాజ్య కౌన్సిల్ సమావేశంలో ఆస్ట్రేలియా ప్రతినిధి జపాన్‌లో అమెరికా అనుసరిస్తున్న పాలసీనిగురించి తీవ్రంగా విమర్శించాడు. కాని యీ ధోరణి కొద్ది కాలంలోనే అంతమైంది. జపాన్‌తో శాంతిఒడంబడిక చేసుకొనే సమస్యను చర్చించేందుకు 1947 ఆగస్టులో కాన్‌బెర్రాలో జరిగిన బ్రిటిష్ సామ్రాజ్య దేశాల సమావేశంలో ఛీఫ్లీ, ఇవాట్‌ల ఆస్ట్రేలియా లేబరు ప్రభుత్వం అమెరికా ముందు పూర్తిగా లొంగిపోయింది. సిడ్నీలో ప్రచురించబడే "డైలీమిర్రర్" పత్రిక 1947 ఆగస్టు 28 వ తేదీన యీ సమావేశంలో ఆస్ట్రేలియా వైఖరిని వివరించుతూ పసిఫిక్ ప్రాంతంలో అమెరికా పలుకుబడి సంఘటితపడటమే తమ అభిమతమని ఆస్ట్రేలియా ప్రతినిధులు చెప్పినట్లు ప్రకటించింది. మూడు రోజుల తరువాత మరొక సిడ్నీపత్రిక "సండే టెలిగ్రాఫ్" ఉత్తర పసిఫిక్‌లోని అమెరికా మిలిటరీ ప్లానులకు ఏవిధమైన భంగంవాటిల్లినా దూర ప్రాచ్యంలోని బ్రిటిష్ ఆర్థిక ప్రయోజనాలు నష్టపడిపోతాయని వ్రాసింది. సోవియట్ యూనియన్‌కు వ్యతిరేకంగా జపాన్‌ను అమెరికా యుద్ధకేంద్రంగా మార్చే విషయంలో సమావేశంలో ఏకగ్రీవ ఒడంబడిక జరిగిందని ఆపత్రికే ధృవపరచింది.

చరిత్ర పాఠాలను ఆస్ట్రేలియా లేబరునాయకులు నేర్చుకొనలేదని స్పష్టమవుతోంది. రెండో ప్రపంచ యుద్ధానికి ముందు వారు జపాన్‌ను సోవియట్ యూనియన్‌కు వ్యతిరేకంగా వుంచాలని ప్రయత్నించారు. ఆవిధంగాఅయితే జపాన్ దక్షిణ సముద్రాలకు విస్తరించకుండా వుంటుందని ఆశపడ్డారు. రెండో ప్రపంచ యుద్ధానంతరం పసిఫిక్ ఉత్తర ప్రాంతాన అమెరికా సామ్రాజ్య విస్తరణకు అన్నివిధాలా సహాయపడటానికి సిద్ధపడ్డారు. ఆవిధంగా అయితే దక్షిణానికి అమెరికా విస్తరణ జరిగే అవకాశాలు సన్నగిలుతాయని వారు ఆశిస్తున్నారు.

ఆస్ట్రేలియా లేబరుపార్టీనాయకుడు ఇవాట్ చాలాకాలాన్నుండి ఆంగ్లో - అమెరికన్ సామ్రాజ్యవాదులకు బంటుగా వ్యవహరించుతూ, అమెరికా దురాక్రమణ విధానాన్ని బలపరస్తున్నాడు. 1946 లో జరిగిన పారిస్ శాంతి సమావేశంలోనే అంతులేని ప్రతిపాదనలనూ, సవరణలను ఉపపాదించి ఇవాట్ శాంతి ఒడంబడిక జరుగకుండా చెడగొట్టడానికి తనశక్తికొలదీ ప్రయత్నించాడు. ఈ "సోషలిస్టు" భద్రతాసమితిలో అగ్రరాజ్యాల మధ్య అంగీకారం వుండాలన్న సూత్రానికి వ్యతిరేకంగా ఎంతో కాలాన్నుండి చిందులుతొక్కుతున్నాడు. దానితోపాటు అంతర్జాతీయ సహకారానికి శత్రువులుగా వ్యవహరించే వారికి సహాయ పడుతున్నాడు. మిత్రరాజ్య సమితి జనరల్ అసెంబ్లీ మూడో సమావేశంలో ఆంగ్లో-అమెరికన్ సామ్రాజ్య వాదుల యెడ ఇవాట్ లొంగుబాటు తత్వమంతా స్పష్టంగా వెల్లడిఅయింది.

ఆసమావేశానికి తానధ్యక్షుడుగావున్న అవకాశాన్ని వినియోగించుకొని అమెరికా ప్రతిపాదనలను ఇవాట్ బహిరంగంగా బలపరచాడు. శాంతి ఆశయాన్ని బలపరచే తలంపుతో ఆయుధ బలాలను తగ్గించాలనీ ఆటం అయుధాలను నిషేధించాలనీ సోవియట్ ప్రతినిధులు ప్రవేశపెట్టిన ప్రతిపాదనలకు అడ్డుపెట్టాడు. 1943 అగస్టు 26 వ తేదీన తన పారిస్ ప్రసంగంలో మాలటోవ్ ఇవాట్ను గురించి మాట్లాడుతూ యిలా అన్నాడు:

"ఈసమావేశంలో వెనుకటి దురాక్రమణ దారులకు ప్రతినిధి వుండి వున్నట్లయితే - అతడు యీ విధమైన ప్రతిపాదనలూ సవరణలూవుండాలని పట్టుబట్టెడివాడు".

—వి. యం. మాలటోవ్ పారిస్ శాంతి సమావేశంలోని ప్రసంగాలు, మాస్కో 1946 పేజీ 70.

బ్రిటిషు డొమినియన్‌లలోని మితవాద లేబరు వాదులు తమ పాలసీ ద్వారా బ్రిటిషు సామ్రాజ్యంపై "వాల్ స్ట్రీట్" దాడిని మరింత సులువు చేశారు. వారు అనుసరించే పాలసీ పశ్చిమ యూరప్‌లో మార్షల్ ప్లానును అమ్మేపాత్రను నిర్వహించుతున్న అట్లీ, బెవిన్‌ల పెద్ద ఎత్తున అనుసరిస్తున్న పాలసీయొక్క ప్రతిబింబం మాత్రమే.

బ్రిటిషు సామ్రాజ్యవాదం యొక్క పాతసేవకులైన డొమిని యన్‌ల మితవాద లేబరువాదులు బ్రిటన్‌లోని తమ సోదరుల అడుగు జాడలలోనే రెండో ప్రపంచ యుద్ధం ముగిసిన తరువాత పూర్తిగా అమెరికాను బల పరుస్తూ, దాని సామ్రాజ్యవాద పాలసీను కొనసాగించుతున్నారు. "ఆంగ్లో - అమెరికన్ మిత్రత్వానికి" వారిప్పు డాట పట్టుగా తయారయ్యారు. ఈ విధంగా ఆంగ్లో - అమెరికన్ మిత్రత్వానికి పాటుపడుతున్నా మన్న ముసుగు క్రింద సోవియట్ యూనియన్‌కు వ్యతిరేకంగానూ, దాని నాయకత్వాన నడుస్తున్న సామ్రాజ్యవాద వ్యతిరేక ప్రజా తంత్ర శిబిరానికి వ్యతిరేకంగా ఆంగ్లో - అమెరికన్ కూటమిని నిర్మించారు.

అమెరికన్ గుత్త పెట్టుబడి దారులు డొమినియన్‌లలోకీ, ఇంపీరియల్ కలోనియల్ మార్కెట్లలోకి, చొచ్చుకొని పోయి, బ్రిటిషు సామ్రాజ్య మంతటినీ తమ మిలిటరీ రాజకీయ దురాక్రమణ ఎత్తుగడలకు విని యోగించుకోడానికి లేబరు నాయకులు ఎంతగానో సహాయపడ్డారు. వారితోపాటు డొమినియన్‌ల లోని గుత్త పెట్టుబడిదారులకు ప్రాతినిధ్యం వహించే లేబరు నాయకులు తమ సామ్రాజ్య ప్రయోజనాలకు దిట్టమైన రక్షకు లయ్యారు.

లేబరు నాయకుల పాలసీ మరింత మితవాత తత్వానికి దిగ జారడం, వారు తమ జాతీయ ప్రయోజనాలకు బహిరంగంగా ద్రోహం చేయడం – ఇదంతా వారు అమెరికా సామ్రాజ్యవాదం ముందు లొంగిపోవడంలో ద్యోతక మవుతుంది. ఇదే బ్రిటిషు డొమిని యన్‌లలోని వివిధశక్తుల పరివర్త నను ప్రతిబింబిస్తుంది.

బ్రిటిషు డొమినియన్‌లలోని శ్రామిక ప్రజలు రోజుకురోజుకు దృఢనిశ్చయులై ఆంగ్లో - అమెరి కన్ సామ్రాజ్యవాదుల బానిస త్వాన్నుండి విముక్తిపొంది, తమ జాతీయ స్వాతంత్ర్యాన్ని సాధించు కొనేందుకు పోరాటానికి సంసిద్ధుల వుతున్నారు. తమ డొమినియన్ లను బానిసత్వంలో ముంచడానికి అమెరికాగుత్తపెట్టుబడిదారులతో చేతులుకలిపిన మితవాద లేబరు వాదులపాలసీలకుతమ వ్యతిరేకతను

వెల్లడించుతున్నారు. ఈ దేశాల జాతీయ సర్వస్వాతంత్ర్యా నికీ, రాజకీయ స్వాతంత్ర్యానికి ప్రమాదం కల్పించిన అమెరికా స్రామాజ్యవాద దురాక్రమణ దారులను ఎదుర్కోవడంలో అంతరికంలేముందు మొనగాడుగా నిలబడే డొమినియన్‌లలోని కమ్యూనిస్టుపార్టీల బలం త్వరిత గతిని వృద్ధి పొందుతోంది. మిత వాద లేబరువాదుల ప్రజావ్యతిరేక అమెరికా అనుకూల పాలసీకి వ్యతి రేకంగా డొమినియన్‌లలోను, కాలనీలలోనూ, వున్న ప్రజాతంత్ర శక్తులన్నింటినీ ఆంగ్లో - అమెరికన్ స్రామాజ్యవాదానికి వ్యతిరేకంగా పోరాటానికిఐక్యపరచడమే కమ్యూ నిస్టుల పాలసీ. ఈ పాలసీని 1947 ఫిబ్రవరిలో లండనులో సమావేశ మైన బ్రిటిషు స్రామాజ్యంలోని కమ్యూనిస్టుపార్టీల ప్రథమ సమా వేశం ఏకగ్రీవంగా ఆమోదించింది.

డొమినియన్‌లలోని కార్మిక వర్గానికి అగ్రగామి శక్తిగా పని చేసే కమ్యూనిస్టుపార్టీలు రెండో ప్రపంచ యుద్ధకాలంలో సంఖ్యా రీత్యా అభివృద్ధి చెంది ప్రజా సామాన్యంలో తమ బలాన్ని సంఘటిత పరచుకొన్నాయి. కార్మికవర్గానికి వ్యతిరేకంగా దేశీయపెట్టుబడిదారీ వర్గం బ్రిటిష్ అమెరికన్ పెట్టుబడిదారులూ సాగించే దాడికీ, ఆంగ్లో - అమెరి కన్ స్రామాజ్యవాదుల పాలసీ లకూ వ్యతిరేకంగా కమ్యూనిస్టు పార్టీలు ప్రతిఘటనోద్యమాలను నిర్మించుతున్నాయి డొమినియన్ లలోని అభివృద్ధినిరోధక వర్గాలు అమెరికా స్రామాజ్యవాదుల, వారి బ్రిటిష్ లేబరుసేవకుల ప్రోత్సాహంతో కమ్యూనిస్టులపై యుద్ధాన్ని కొనసాగించు తున్నారు.

కెనడాలో 1946 లో అభివృద్ధి నిరోధకవర్గాలు బనాయించిన కుట్రకేసు అనంతరం పెద్దఎత్తున కమ్యూనిస్టు వ్యతిరేకదాడిని ప్రారంభించారు. లేబరు ప్రోగ్రె సివ్‌పార్టీ ఆఫీసుపై పెద్దగా దాడులు చేశారు. అభ్యుదయకర పత్రికలన్నింటినీ నిషేధించారు. కెనడా కామన్సు సభలో కెనడా ప్రోగ్రెసివ్‌పార్టీని నిషేధించాలన్న సమస్య అనేకసార్లు వచ్చింది. కెనడా సోషల్ డెమోక్రటిక్‌పార్టీ, అభివృద్ధి నిరోధకులు సాగించు తున్న కమ్యూనిస్టు వ్యతిరేక దాడు లలో సంపూర్తిగా పాల్గొం

టున్నది. కమ్యూనిస్టులను నిందించడానికి నీచమైన అబద్ధాల సహాయం వలిస్తుంది. కాని యింత జరిగినప్పటికీ, ఇంత తీవ్రంగా దాడులు జరిగినప్పటికీ కమ్యూనిస్టులు కెనడా ట్రేడ్‌యూనియన్‌లలో గణనీయంతగా తమ పలుకుబడిని సంఘటిత పరచుకో గలిగారు. "సోషల్ డెమోక్రట్లు ట్రేడ్‌యూనియన్‌లలో తమ రాజకీయ పలుకుబడిని సంఘటిత పరచుకోడానికి ప్రధాన అడ్డంకి కమ్యూనిస్టు పార్టీయే" అని కెనడా లేబరు నాయకుడైన డేవిడ్ లూయిస్ తప్పనిసరిగా ఒప్పుకో వలసి వచ్చింది.

ఆస్ట్రేలియాలో కమ్యూనిస్టులనూ, యితర అభ్యుదయకర ప్రజాతంత్ర శక్తులనూ, సంస్థలనూ వేటాడటం 1946 మధ్యలో ప్రారంభమైంది. 1946 జూన్ మాసంలో జరిగిన న్యూసౌత్ వేల్సు రాష్ట్రంలో లేబరుసంస్థల వార్షికసమావేశంలో 'కలసి ఎన్నికలలోపోటీచేద్దామన్న' కమ్యూనిస్టుపార్టీ ప్రతిపాదన త్రోసివేయబడింది. అదేసమయం లోనే లేబరువాదులెవరూ సోవియట్ మిత్రమండలికి సంబంధించిన సంస్థలలో సభ్యులుగా చేరరాదని ఆ సమావేశం నిర్ణయించింది దేశం లోని మధ్యప్రాంతాలను మారణ యంత్రాల పరిశోధనకు వినియోగించే ప్లానుకు ఆస్ట్రేలియాలోని ప్రజాతంత్ర వర్గాలు తమ అసమ్మతిని తెలుపగా ప్రజలను రెచ్చగొడుతున్నారని కమ్యూనిస్టులపై నిందారోపణచేశారు. కమ్యూనిస్టుపార్టీ దేశరక్షణను ఆటంకపరుస్తున్నదని అభివృద్ధి నిరోధకపత్రికలు గగ్గోలు పెట్టాయి. ఈ సందర్భంలోనే అభివృద్ధి నిరోధకులు కమ్యూనిస్టు పార్టీని నిషేధించాలని పార్లమెంటులో గొంతుచించుకొన్నారు.

బ్రిటిషు లేబరు ప్రభుత్వాన్ని పూర్తిగా బలపరచే ఫీల్డు మార్షల్ స్మట్సు, బ్రిటిషు సామ్రాజ్య వాదానికి పట్టుగొమ్మా, జాతి విద్వేషి అయిన ప్రధాని మలాన్ పరిపాలన సాగిస్తున్న దక్షిణాఫ్రికా యూనియన్‌లో కమ్యూనిస్టులపై దాడి బహిరంగ భయంకర బీభత్స స్వరూపాన్నే దాల్చింది. 1946 ప్రారంభంలో ప్రభుత్వ రహస్యాలను కాపాడేచట్టంక్రింద దక్షిణాఫ్రికా కమ్యూనిస్టుపార్టీ నాయకత్వంపై ఒక "కేసు" బనాయించబడింది. ఈ తప్పుడు కేసు రుజువుకాదని తేలగానే పార్టీ

నాయకత్వంపై మరొక కొత్త చార్జి తేబడింది 1946 ఆగస్టులో సమ్మె చేయవలసిందిగా ఆఫ్రికా కార్మికులను "రెచ్చగొడుతున్నా" రనే నేరం ఆరోపించ బడింది. సమ్మె పోలీసులచే క్రూరంగా అణచవేయ బడింది. ఈ సందర్భంలో పోలీసులు 120 మంది కార్మికులను చంపడమో గాయ పరచడమో జరిగింది. ఈ సమ్మె నొక సాకుగా తీసుకొని అభివృద్ధి నిరోధకులు కమ్యూనిస్టుపార్టీకి వ్యతిరేకంగా బీభత్స చర్యలను ప్రారంభించారు.

ఆంగ్లో-అమెరికన్ సామ్రాజ్య వాదుల ఆజ్ఞలననుసరించి బ్రిటిష్ డొమినియనుల లోని ప్రజాతంత్ర శక్తులకు వ్యతిరేకంగా కుట్ర సాగుతోంది. అన్ని డొమినియనులలో ఒకేసారి కమ్యూనిస్టు వ్యతిరేక దాడి ప్రారంభం కావడంతో ఈ యథార్థం రుజువైంది. ఈకుట్రలో అమెరికా బ్రిటిషు గుత్తపెట్టుబడి దారీ వర్గాలతో పాటు మితవాద లేబరునాయకులు భాగస్వాము లయ్యారు.

డొమినియనులలోని ప్రజాతంత్ర శక్తులను చూసి గుత్త పెట్టుబడిదారీ వర్గం విపరీతంగా భయపడుతోంది. ఈ ప్రజాతంత్ర శక్తులు నానాటికి అభివృద్ధి చెందుతూ ఆంగ్లో - అమెరికను సామ్రాజ్య వాదుల దురాక్రమణ ప్లానులను కృతనిశ్చయంతో దృఢంగా రోజురోజుకూ ప్రతిఘటించుతున్నాయి.

"ప్రోబ్లమ్స ఆఫ్ ఎకనామిక్స" నుండి
[సంచిక 7, 1948]

---

అమెరికా నాగరికత అని మీరు పిల్చే ఆ 'నాగరికత' నాలో ఎట్టి సానుభూతినీ కలిగించడంలేదు. కలిగించ జాలదు కూడా. యూరోపియన్ నాగరికతలోని లజ్జాకరములైన వికృతలక్షణాలన్నీ అమెరికా నాగరికతలో అత్యున్నత శిఖరాలనందుకున్నాయి. కాబట్టి మన ఈ భూగోళంలో నున్న నాగరికతలన్నిటి కంటె మీ (అమెరికా) నాగరికత అత్యంత వికృతమైనదిగా నేను భావిస్తున్నాను.

— గోర్కీ.

# : మితవాద సోషలిస్టులు :
# కార్మికోద్యమ విచ్ఛిన్నకులు

కూసినిన్

యుద్ధానంతరం యూరప్‌లో జరిగిన వర్గపోరాటాలలో గడించిన నూతన అనుభవం ఫలితంగా అభివృద్ధినిరోధక బూర్జువావర్గానికి వ్యతిరేకంగా శ్రామిక ప్రజలు జరిపే పోరాటంలో కార్మికవర్గ ఐక్యతా ప్రాముఖ్యతనూ అవసరాన్నీ ఇదివరకెన్నడూ లేనంత స్పష్టంగా చూడగలిగాం.

ఫాసిస్టు బానిసత్వాన్నుండి నూతన ప్రజాతంత్రరాజ్యాలను సోవియట్ సైన్యం విముక్తి చేసిన రోజుననుండీ కార్మికవర్గ ఐక్యతను నిర్మించడంలో కమ్యూనిస్టు పార్టీలు సాధించిన మహత్తర విజయాలు శ్రామికప్రజల విశాల ప్రజాతంత్ర సంఘటనను నిర్మించడానికి చక్కని పునాదిని వేశాయి. అభివృద్ధినిరోధక బూర్జువా పార్టీలలోని ముఠాలూ, వాటి గులాములైన సోషల్ డెమోక్రట్లూ ప్రజలతో పూర్తిగా వేరుపడిపోయి త్వరత్వరగా నాశనంచెంద ప్రారంభించారు. శ్రామికవర్గ ఐక్యత బలవత్తరమవుతున్నకొద్దీ శ్రామిక ప్రజల - కార్మికుల, కర్షకుల, అభ్యుదయమేధావుల-నూతన ప్రజాతంత్ర అధికారంయొక్క పునాది మరింత గట్టిపడసాగింది.

ఈ దేశాలలోని కార్మికవర్గ పార్టీలు మార్క్సిజం - లెనినిజాన్ని ఆధారం చేసుకొని సంపూర్ణంగా ఐక్యపడినతరువాత వ్యతిరేకవర్గాలు ఇంకెంత తన్నుకున్నా నూతన ప్రజాతంత్రరాజ్యాలను విచ్ఛిన్నపరచలేకపోయినాయి. సోషలిజంవైపుకు వాటి పురోగమనాన్ని అడ్డుపరచలేకపోయినాయి.

యూరప్‌లోని కేపిటలిస్టుదేశాలలో కూడా కార్మికవర్గ ఐక్యతకు జరిగిన పోరాటాలలోనూ ముఖ్యంగా వివిధదేశాలలోని ట్రేడ్ యూనియన్ ఉద్యమాలలో ఐక్యతను సాధించడంలోనూ ప్రపంచ ట్రేడ్ యూనియన్ ఫెడరేషన్ నిర్మాణంలోనూ, కార్యకలాపాలలోనూ ముఖ్యమైన విజయాలను సాధించడం సంభవించింది. కాని బూర్జువా పాలకవర్గాలకు కార్మికవర్గ ఐక్యతంటే విపరీతమైన భయం. అందువలననే బూర్జువావర్గం కార్మికోద్యమంలోని తన ఏజెంట్లను కార్మికవర్గాన్ని ఏదోవిధంగా చీల్చి, విచ్ఛిన్నపరచమని నియోగిస్తుంది. అందుకనే శ్రామికప్రజలనూ, కమ్యూనిస్టులనూ, సోషలిస్టులనూ మరి యితరులనూ సంఘటితపరచే ప్రతి పయత్నమూ కార్మికవర్గాన్ని చీల్చి, విచ్ఛిన్నపరచే సంస్కరణ

ట్రేడ్‌యూనియన్ నాయకులతో సహా మితవాద సోషలిస్టుల కుతంత్రాలను తదేక దీక్షతో ఎదుర్కొనడంతో జతపరచవలసి ఉంటుంది. మితవాద సోషలిస్టులకు వ్యతిరేకంగా కమ్యూనిస్టు అగ్రగామి జరిపే యీ పోరాటం కార్మికవర్గ ఐక్యతకొరకు జరిపే పోరాటంతో తప్పనిసరిగా మిళితమవుతుంది.

1946 ఆకురాలు కాలంలో ఫ్రాన్సులోని కార్మికవర్గంలో ఐక్యతకొరకు ఎంతటి గాఢవాంఛ బయలుదేరిందంటే సోషలిస్టుపార్టీ సహితం తన మహాసభలో సంయుక్తకార్మికవర్గపార్టీ నిర్మాణంకోసం కమ్యూనిస్టులతో రాయబారాలు సాగించాలనే నిర్ణయం చేయవలసివచ్చింది. ఈ నిర్ణయం అభివృద్ధినిరోధకబూర్జువావర్గాన్ని గందరగోళపరచింది. దీనితో ఫ్రెంచి కార్మిక ఉద్యమాన్ని చీల్చి- ఉంచడానికి శాయశక్తుల ప్రయత్నించమని మితవాద సోషలిస్టునాయకులకు బూర్జువా వర్గము విజ్ఞప్తులు చేయడం ప్రారంభించింది. ఫ్రాన్సులోని మితవాద సోషలిస్టునాయకులకు సహాయపడేందుకు బ్రిటిష్ లేబరు పార్టీ రాయబారులుకూడా దిగుమతయ్యారు. ఈ విధంగా కేపిటలిస్టు సంరక్షకులు సోషలిస్టుపార్టీ మహాసభ నిర్ణయాన్ని మట్టిగలపడంలో జయం పొందారు.

అప్పటినుండి పశ్చిమ యూరప్‌లోని మితవాద సోషలిస్టులు బ్రిటిషు లేబరు పార్టీ నాయకుల నాయకత్వాన కార్మిక ఉద్యమంలోని చీలికను శాశ్వతం చేయాలనే ఆశతో కమ్యూనిస్టులపైనా, కమ్యూనిస్టులతో సహకరించాలనే నిజమైన సోషలిస్టులపైనా ఎడతెగని నిందాప్రచారాన్ని ప్రారంభించారు. తమ విచ్ఛిన్న ప్రయత్నాలను కొనసాగించేందుకు మితవాద సోషలిస్టులు యూరప్ ఖండలో 'అంతర్జాతీయ సోషలిస్టు కాన్ఫరెన్సుకమిటీ' అనే పేరుతో ఒక కమ్యూనిస్టు వ్యతిరేక సంస్థను ఏర్పరచారు. ఇది దివాళాతీసిన రెండో అంతర్జాతీయసంస్థకు ఒక విధమైన "నకలు" అనవచ్చు. కాని మితవాద రాజకీయనాయకుల నాయకత్వానవున్న సోషలిస్టుపార్టీ క్రిందవర్గాలలో అసంతృప్తి నానాటికీ పెచ్చుపెరిగిపోతున్నది. ఇప్పటికే చాలమంది వర్కర్లు యీ పార్టీలనుండి వైదొలగారు. ఫ్రాన్సులోని సోషలిస్టుపార్టీ 1947 లో దాదాపు 100,000 సభ్యులను పోగొట్టుకొన్నది. సోషలిస్టుపార్టీకి చెందిన యువజనసంఘ సభ్యత్వం 1500 కు దిగజారిపోయిందని గత సంవత్సరంలో పార్టీ మహాసభలో ప్రకటించబడింది. ఐక్యతకోసం నూతనంగా ఏర్పడిన సోషలిస్టుపార్టీ, కమ్యూనిస్టుపార్టీతో సన్నిహితంగా సహకరించుతోంది.

ఇటలీలో సోషలిస్టు కమ్యూనిస్టు పార్టీల ఐక్యకార్యాచరణను భగ్నపరచాలని బ్రిటిష్‌లేబరుపార్టీ ఏజెంట్లు అనేకసార్లు ప్రయత్నించి విఫలత చెందారు.

దీనికితోడు మితవాద సోషలిస్టులకు గురుపీఠమైన బ్రిటన్‌లో సహితం అభివృద్ధినిరోధక లేబరుపార్టీ ట్రేడ్‌యూనియన్ నాయకులకు వ్యతిరేకత క్రమేణా పెరిగిపోతున్నది. అందువలననే కేపిటలిస్టు దేశాలలోకూడా కార్మికవర్గాన్ని చీల్చడానికి పూనుకొన్న విచ్ఛిన్నకుల ప్రయత్నాలు సఫలంకావడం కష్టమవుతున్నది. మరొకవైపున ఒకేవేదికపై కార్మికవర్గం ఐక్యమయ్యే అవకాశాలు వృద్ధి అవుతున్నాయి.

అయితే యీ రకమైన ప్రధాన మార్పులకు దారితీస్తున్న కారణాలేమిటి? రెండో ప్రపంచయుద్ధఫలితంగా అంతర్జాతీయ పరిస్థితులలో వచ్చిన ప్రధానమైన మార్పులే వీటికి కారణం. పెట్టుబడిదారీ విధానం బలహీనపడిపోవడం సర్వవ్యాపిత సంక్షోభం మరింత తీవ్రతరమవడం, సోవియట్ యూనియన్ బలమూ ప్రతిష్టా హెచ్చడం, సోవియట్ ప్రజలూ నూతనప్రజాతంత్ర రాజ్యాల శ్రామిక ప్రజలూ నూతనవిజయాలను సాధించడం, ఈ పరిస్థితులన్నింటియొక్క ప్రభావం కేపిటలిస్టు దేశాలలోని కార్మికులపై పడుతోంది. అంతేకాక బూర్జువావర్గం తమ సోషలిస్టు మంత్రులద్వారా అనుసరిస్తున్న అభివృద్ధినిరోధక పాలసీ దుష్ఫలితాలను స్వయంగా అనుభవించడం మూలంగా కార్మికులు యీ సత్యాన్ని సులభంగా గ్రహించగలుగుతున్నారు.

పెట్టుబడిదారీ విధానంలోని పరస్పర వైరుధ్యాలు తీవ్రతరమవుతున్న నేటి దశలో బూర్జువా పాలకవర్గం పాతకాలంలోని "లేబరిజాన్ని" యింకా అనుసరించే అవకాశం లేకుండా పోయింది. దానిని కొనసాగించే వాంఛకూడా బూర్జువా వర్గానికిలేదు. ఎందువల్లనంటే తన అధికారం యొక్క పునాదే కూలిపోతుందనే భయం బూర్జువా వర్గాన్ని బాధించడం ప్రారంభించింది. అందువల్ల ప్రథమ ద్వితీయ ప్రపంచయుద్ధాల మధ్యకాలంలో బూర్జువా ప్రజాతంత్ర దేశాలలో కేపిటలిస్టు వ్యవస్థ పునాదులను అట్టేపెట్టి ఉంచడానికి సోషల్ డెమాక్రాట్ పార్టీలు అనుసరించిన విధానం - బడా, మధ్య, ఛోటా బూర్జువావర్గాల ప్రయోజనాల మధ్య అటూ యిటూ నాటకమాడే విధానాన్ని కూడా యిప్పుడు బూర్జువా వర్గం అంగీకరించదు. ఈనాడు ప్రతి కేపిటలిస్టు ప్రభుత్వమూ అన్నింటికంటే ముందు బూర్జువా గుత్తాధివర్గాల సంకుచిత అభివృద్ధి నిరోధక డిమాండ్లను సంతృప్తి పరచవలసి ఉంటుంది. దీనికితోడు అమెరికా సామ్రాజ్యవాద ఆర్థిక, మిలిటరీ, రాజకీయ ప్లానులకు అనుగుణ్యంగా అంటగట్టబడిన యూరప్ దేశాలలోని బూర్జువాజీ కరుడుగట్టిన అమెరికా అభివృద్ధి నిరోధక గుత్త పెట్టుబడిదారుల మిలిటరీవేత్తల ఆజ్ఞలననుసరించి తను పాలసీలను మార్చుకోవలసిందిగా తమ తమ ప్రభుత్వాలకు ఆదేశించింది.

ఈ రకమైన పనిని నిర్వహించడానికి లంచగొండి మితవాద సోషలిస్టులు ఎంతమాత్రమూ సంకోచించరు. బ్రిటన్, ఫ్రాన్సు ఇటలీ, బెల్జియం ప్రభుత్వాలలో వున్న వారి మంత్రులు తమ దేశాలలోని అభివృద్ధి నిరోధక బూర్జువాజీకి ఎలా విశ్వసనీయంగా పనిచేశారో అదేవిధంగా అమెరికా సామ్రాజ్యవాదులకు సహితం వూడిగం చేయడానికి సంసిద్ధపడ్డారు. కాని ఇందువల్ల శ్రామికప్రజలపై తమ పలుకుబడిని యథావిధంగానే ఉంచుకోవడం రోజురోజుకు కష్టసాధ్యమవుతోంది. వారి యజమానులు కొద్దిపాటి కార్మిక వ్యతిరేక చర్యలతో సంతృప్తిచెందడంలేదు. కార్మిక వర్గానికి శ్రామిక ప్రజలందరి ప్రధాన ప్రయోజనాలకూ పూర్తిగా విరుద్ధంగా వుండే అభివృద్ధినిరోధక పాలసీని బహిరంగంగా అనుసరించవలసిందిగా వారు నేడు డిమాండ్ చేయడం ప్రారంభించారు.

దీనితో ఏదో బూటకపు ప్రజాతంత్ర శాసనాలతో ప్రజలను మోసపుచ్చుదామనుకునే మితవాద సోషలిస్టుపార్టీల పని మరింత కష్టసాధ్యమైపోయింది.

## II

నేటి పాలసీలోని కొన్ని ప్రధాన సమస్యలను గురించి ఆలోచిద్దాం. పశ్చిమ యూరప్‌లోని మితవాద సోషలిస్టులు ప్రజలను మోసపుచ్చడానికి తమకున్న అవకాశాలలో ఎన్నింటిని యిప్పటికే వినియోగించుకో గలిగారు? ఇంకా శ్రామిక ప్రజలను మోసపుచ్చడానికి వారికి రోజు రోజుకు ఎలా అసాధ్యమైపోతున్నదో పరిశీలిద్దాం.

ప్రథమసమస్య కార్మికుల దైనందిక భౌతిక అవసరాలను సంబంధించినది- చాలీచాలని జీతాలు, కొనుగోలుశక్తి పడిపోవడం, ఇంటిఅద్దెలు హెచ్చడం, పన్నుల భారం అధికమవడం నానాటికి నిరుద్యోగ సమస్య తీవ్రతరమవడం.

గత రెండుసంవత్సరాలుగా బ్రిటిష్ లేబర్ ప్రభుత్వం యూరప్‌లోని * మార్షల్ దేశాల ప్రభుత్వాలు యీ సమస్యలపై అమెరికా "మార్షల్‌ప్లాన్" వ్యాపారస్తులతో రహస్య ఒడంబడికలు చేసుకొని ఒకప్లాను ననుసరించుతున్నారు. ఈప్లాను కార్మికుల యితర సామాన్య ప్రజల జీవనప్రమాణాన్ని మరింత తగ్గించి వేస్తున్నది. ఈ విషయాన్ని గురించి మంత్రులు అంతగాబహిరంగంగా మాట్లాడటానికి యిష్టపడటంలేదు. కాని ప్రతి కార్మిక కుటుంబమూ నేడు యీ విపరీతమైన దారుణపాలసీ ఫలితాలనుగురించి బాధపడుతోంది.

పెట్టుబడిదారులు పాతకాలపు దోపిడివిధాన పద్ధతులననుసరించి (ప్రత్యక్షంగా జీతాలనుకోయడం) పచ్చి దొంగల దోపిడిని కొనసాగించివున్నట్లయితే వెనువెంటనే కార్మిక ప్రజల తీవ్ర వ్యతిరేకతకూ, ద్వేషాగ్నికీ బలికాబడి వుండేడివారు. కాని పెట్టుబడిదారీ ప్రపంచంలోని పాలకవర్గాలు బాగా తెలివిమీరాయి. ఇదివరలాగే నేడు వారు కనీసవేతనాలను తగ్గించరు (ఒక్కొక్కప్పుడు వున్న జీతాలను కొద్దో గొప్పో కలుపుతారుకూడా) దీనికి బదులుగావారు ఆహారం, యితర పదార్థాల ధరలు బాగా పెంచుతారు. కరెన్సీ విలువను తగ్గించివేస్తారు. ప్రత్యక్ష పరోక్ష పన్నులను అధికం చేస్తారు. ఈవిధంగా వారు కార్మికులను, యితర పేద ప్రజా సామాన్యాన్నీ దోచుకొంటారు.

ఈ రకమైన దోపిడీవిధానం బ్రిటన్, ఫ్రాన్సు యితర మార్షల్ దేశాలలోని

* మార్షల్ దేశాలు మార్షల్‌ప్లానుననుసరించి అమెరికానుండి అప్పులు తీసుకొంటున్న దేశాలను మార్షల్ దేశాలని పిలవడం సర్వసామాన్యమై పోయింది.

కేపిటలిస్టులకు అత్యధికలాభాలను తెచ్చి పెడుతున్నది. యీ లాభాలన్నింటికీవారు తమ 'లేబర్' 'సోషలిస్టు' మంత్రులకూ వారి పార్టీలకు రుణపడివున్నారు. అయితే దీనికి మరొక ఫలితం కూడా లేకపోలేదు. మితవాద సోషలిస్టుల పలుకుబడికి యిది తీవ్రమైన దెబ్బతీస్తుంది. ప్రావీణ్యత గలిగిన (స్కిల్డు) కార్మికునికి యిదివరకున్న జీవన ప్రమాణమే ముఖ్యంగా బ్రిటన్‌లో కొన్ని దశాబ్దాలుగా సంస్కరణ నాయకత్వానికి చక్కని ఆర్థిక పునాదినిచ్చింది. అదే వారికి కార్మికోద్యమంలో పలుకుబడిని, స్థానాన్ని అట్టిపెట్టగలిగింది. కాని యీనాడు గుత్తపెట్టుబడిదారుల నీచమైన దురాశకు సహాయపడటం మూలంగా యీ దేశాలలోని శ్రామికుల జీవన ప్రమాణం చాల వరకు తగ్గిపోయింది. సంస్కరణ కార్మిక నాయకులు యిప్పటి వరకు తిష్టవేసుకొన్న పీఠాలకు యీనాడు ప్రమాదం సంభవించింది.

బ్రిటిష్ కార్మికులు తమదైనందిన కష్టాలను తీర్చడానికి తమ ట్రేడ్ యూనియన్‌లపై ఆశను పెట్టుకొంటారు. దీనికి బదులుగా కార్మికుల హక్కుల రక్షణ కోసం ఎల్లప్పుడూ ఖచ్చితంగా నిలబడే వారిని యూనియన్‌లనుండి బర్తరఫ్ చేయవలసిందిగా లేబరు నాయకులు కార్మిక సంఘాలను కోరుతున్నారు. అంటే దాని అర్థం కార్మికసంఘాలనుండి కమ్యూనిస్టులను తొలగించడమన్నమాట. ఐతే ఈవిధంగా కార్మికసంఘాల నుండి కమ్యూనిస్టులను తొలగించడంమూలంగా నానాటికీదుర్భరమవుతున్న తన ఆర్థికస్థితి బాగుపడుతుందని బ్రిటిష్ కార్మికుని నమ్మించడం సాధ్యమా? ఎప్పటికీ సాధ్యంకాదు. గత రెండుసంవత్సరాలుగా లేబరుపార్టీ కార్యవర్గమూ, ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసు జనరల్ కౌన్సిలూ కమ్యూనిస్టులను కనీసం వివిధయూనియన్‌ల కార్యవర్గాలనుండైనా తొలగించుదామనిప్రయత్నాలుచేసి విఫలమయ్యారు.

అమెరికా సామ్రాజ్యవాదులను తృప్తి పరచేందుకు ట్రేడ్‌యూనియన్ జనరల్ కౌన్సిల్ ప్రపంచ ట్రేడ్‌యూనియన్ ఫెడరేషన్ రద్దుచేయాలనికూడా డిమాండ్ చేసింది. ఇక్కడకూడా వారు అపజయాన్ని పొందారు. బ్రిటిష్, అమెరికన్ ట్రేడ్‌యూనియన్లు మాత్రమే ప్రపంచ ఫెడరేషన్‌నుండి బయటకొచ్చాయి. ఈ విధంగా కార్మికవర్గంలో కావాలని చీలికను తీసుకొని వచ్చే ప్రయత్నం వారి ప్రయోజనాలకు అనుగుణ్యమని బ్రిటిషు శ్రామికప్రజానీకాన్ని నమ్మించగల మనుకోవడం వట్టిభ్రమ.

ఫ్రాన్సులో అమెరికా యజమానుల ఆజ్ఞలననుసరించి మితవాద సోషలిస్టులు కార్మికులలో చీలిక తెచ్చి 'జనరల్ కాన్ ఫెడరేషన్ ఆఫ్‌లేబరు'ను నాశనం చేద్దామని పొగరుబోతుతనంగా ప్రయత్నించారు. కాని వారు తమ ప్రయత్నంలో పూర్తిగా విఫలతచెందారు. ఫ్రెంచికార్మికవర్గంయొక్క అనాది ట్రేడ్‌యూనియన్ సంస్థ, అన్నింటికంటే పెద్దసంస్థఅయిన కాన్ ఫెడరేషన్‌లో తమ స్థానాలను కోల్పోయారు. కొద్దిమంది కార్మికులను మాత్రమే వారు చీల్చగలిగారు. నేడు వారినే సమ్మెవిచ్ఛిన్నకారులుగా వినియోచించుతున్నారు:

ద్వితీయ సమస్య: ఫ్రెంచి, ఇటలీ, యింకా యితర దేశాలలోని శ్రామిక ప్రజల ప్రజాతంత్రహక్కులకూ స్వాతంత్ర్యాలకు సంబంధించినది.

బూర్జువా ప్రజాతంత్రానికీ ఫాసిస్టు నియతృత్వానికిమధ్య ప్రధానమైన భేదాలున్నాయని మితవాద సోషలిస్టులు చెప్పుకొనే వాదనను యిదివరకు పశ్చిమ యూరప్‌లో చాలమందికార్మికులు నమ్మేవారు. నిజానికిది పొరపాటు. ఎందువల్లనంటే బూర్జువా దేశాలన్నింటిలో రాజ్యాంగవ్యవస్థయొక్క వర్గపునాదిపై కేపిటలిస్టు ఆధిక్యతే ఎల్లప్పుడూఉంటుంది. అయినప్పటికీ పూర్వపుదశలో సోషల్ డెమోక్రాట్లు బూర్జువా ప్రజాతంత్రదేశాల ప్రభుత్వాల రాజకీయస్వభావానికీ ఫాసిస్టు దేశాల ప్రభుత్వం రాజకీయ స్వభావానికి కొన్ని భేదాలను చూపెట్టగలిగేవారు. వారు యీ విధంగా చెపుతూ వుండేవారు: 'చూడండి! మనదేశంలో తమ ప్రయోజనాలకోసం పోరాడే శ్రామిక ప్రజలపై ప్రభుత్వం నిర్బంధ విధానాన్ని ప్రయోగించదు; సమ్మెచేసే కార్మికులను పోలీసులు కొట్టరు; ప్రదర్శనాలు జరిపే ప్రజలను చెదరగొట్టి, వారిపై తుపాకులను కాల్చరు. మన రాజ్యాంగచట్టం ప్రజాతంత్ర హక్కులకూ, స్వాతంత్ర్యాలకూ రక్షణనిస్తుంది. ఇదంతా మీరు చూస్తున్నదేకదా.' అని చెపుతారు.

ఈనాడు బూర్జువా ప్రజాతంత్ర రాజ్యాల రాజ్యాంగ చట్టాలు కార్మికుల వారి సంస్థల ప్రాథమిక హక్కులను సహితం యింకెంత మాత్రం సంరక్షించవు. ఇదివరకున్న ప్రజాతంత్ర సూత్రాలు రాజ్యాంగ చట్టాలనుండి అదృశ్యం కాని మాట వాస్తవమే. రాజ్యాంగ చట్టాలలో ప్రజాతంత్ర సూత్రాలన్నీ ఉదహరించబడే వున్నాయి. అయినప్పటికీ తమ హక్కుల కోసం మాట్లాడే కార్మికులను అధికారవర్గం హింసిస్తుంది. అంతేకాదు. కార్మికులను కొట్టడం, ప్రదర్శకులపై తుపాకులను కాల్చడం కూడా కద్దు.

బూర్జువా ప్రజాతంత్ర నగ్నసంరూపం నేడు బయట పడిపోయింది. అందువలన నూతన పరిస్థితి సృష్టించబడింది. ఇదివరకు యీ దేశాలలోని బూర్జువాజీ తమసోషల్ డెమోక్రట్ మంత్రులను యింతటి బీభత్స చర్యలను జరమని కోరియుండలేదు. ఉదాహరణకు జూలస్‌మోక్ లాంటివాళ్లు సమ్మెచేస్తున్న గని కార్మికులను సాయుధ సైనికులతో కొట్టించారు.

ఇలాంటివి జరిగిన తరువాత కూడా జూలస్‌మోక్, లియాన్ బ్లుమ్, గేమోలెట్ మొదలగు వారు తాము ప్రజాస్వామిక విధానానికి ప్రతినిధులమనేచెప్పుకుంటారు. అంతేకాక తాము "నిజమైన" "పశ్చిమ" ప్రజాస్వామిక విధానానికి ప్రతినిధులమని డబ్బావాయించుకొంటారు. కాని యీనాడు వారు తమను గురించి అబద్ధాలతో ఎంతడప్పులుకొట్టుకొన్నా శ్రామించి కార్మికులు అభివృద్ధి నిరోధకుల యేజెంట్లయిన వీరి నీచమైన ప్రజాతంత్ర వ్యతిరేక చర్యలను స్పష్టంగాచూడగలుగుతున్నారు.

ఇక తృతీయసమస్య శాంతికి సంబంధించినది.

కార్మికోద్యమానికి సంబంధించిన యీ అత్యంత ముఖ్యసమస్యపై మితవాద సోషలిస్టు తప్పుడువాదనలను చేయడమో, లేక సమస్యనే దాటవేసే వైఖరిని ప్రదర్శించడంమూలంగా వారిస్థితి మరీ విషాద పరిస్థితులలో పడిపోయింది. పశ్చిమ యూరప్‌లోని రాజ్యాలమధ్య వాటికీ అమెరికాకు మధ్య జరిగిన మిలిటరీ కూటముల ప్రస్తావన తేగానే మితవాద సోషలిస్టులు గుమ్మడికాయ దొంగ తముడు

కొన్నట్లు అందులో చెడు ఉద్దేశ్యం లేదనీ, వాటికి మిలిటరీస్వభావమే లేదని కప్పిపుచ్చడానికి ప్రయత్నిస్తారు. నిర్మించ బడుతున్న ఈ కూటాలూ, జరుగుతున్న యీ కుట్రలూ ఏదో అమాయకంగానూ, శాంతియుతంగానూ యూరప్‌ను "ఐక్యం" చేయడానికేననీ, ఎలాంటి ప్రమాదం లేదనీ శాంతియుత 'యూరోపియన్ ఫెడరేషనో' లేక "యూరప్‌రాజ్యాల సంయుక్త సమ్మేళన"కేనని ప్రపంచంనమ్మాలని వారు కోరుతారు. అయితే యూరప్‌ను యీవిధంగా ఐక్యం చేయడంలో తప్పేముంది? కాని పచ్చి సామ్రాజ్యవాది అయిన చర్చిల్ లాంటివాడు పశ్చిమ యూనియన్‌నూ "యూరప్ రాజ్యాల సమ్మేళన"ను ఎందుకు ప్రతిపాదించుచుతున్నాడో అందరికీ స్పష్టముగా కనపడుతూనే ఉంది. అమెరికా సామ్రాజ్యవాదులు యీ విధంగా యూరప్ "ఐక్యత"కోసం ఎందుకు ఒత్తిడి చేస్తున్నారోకూడా అందరికీ స్పష్టంగా అర్థమవుతూనే ఉంది.

ఒక విధంగా చూస్తే యూరప్‌లోని కేపిటలిస్టు దేశాలను "ఐక్యం" చేయడానికి అమెరికా ప్రయత్నించిన మాట నిజమే. ఇంకా ప్రయత్నంచేస్తూనేఉంది. అయితే ఒకసమస్య. ఇది దేనికోసం చేస్తున్నది? అమెరికా సామ్రాజ్యవాదులకు తోడుదొంగలుగా వ్యవహరించుతున్న మితవాద సోషలిస్టులు అమెరికాకుట్రల మిలిటరీ అంతర్యాన్ని దాచిపెట్టడానికి ప్రయత్నించడమేగాక పశ్చిమయూరప్ ప్రజల జాతీయ ప్రయోజనాలకు ప్రత్యేకంగా వాటిల్లేనష్టాన్నికూడ దాచివేయుటానికి యత్నిస్తున్నారు. ఒక ముఖ్య విషయ మేమంటే సామ్రాజ్యవాదరాజ్యం బలహీన దేశాలను "ఐక్యం"చేసే టప్పుడల్లా వాటిని తనకు లొంగుపాటుగా వుంచుకొని బానిసత్వంలో ముంచుతుంది.

కాలం జరిగినకొద్దీ పశ్చిమ యూరప్ ప్రజలు తమ భుజాలపై అమెరికా బానిసత్వపుబరువు అధికమవుతున్నట్లు తెలుకో మితవాద సోషలిస్టునాయకులకు మాత్రమే గలుగుతారు యిది ఎరుకలేనట్లు కనపడుతున్నది. ఐతే బ్లుమ్, స్పాక్ యింకా వారి సహచరులు ఎందుకు "సొంత సర్వస్వాతంత్ర్యహక్కును" వొదులుకోవలసిన అవసరం ఉన్నదనితమ తమ దేశాలకు నచ్చజెపుతున్నారు? దానినిబట్టి వారికి, అసలు విషయం తెలుసునన్న మాట. ఫ్రాన్సును, బెల్జియంను అమ్మితే కొనేవాడొకడున్నాడని.

ఇక్కడే జాతీయవిద్రోహానికి శాంతి ఆశయ విద్రోహానికి దగ్గరలంకె ఉంది.

గతంలో అనేకసార్లు బ్లుమ్ శాంతి స్థాపనకు మొనగాడుగా ముందుకొచ్చిన విషయం మనకువిదితమే. రెండో ప్రపంచ యుద్ధానికి ముందు శాంతిని రక్షించాలని ఒకవేపున అంటూనే మరొకవైపున హిట్లర్‌తో జరిగిన మ్యూనిక్ ఒడంబడికను పూర్తిగా సమర్థించాడు. హిట్లర్ యుద్ధానికి బాటను సరిచేసిన మ్యూనిక్ ఒడంబడికను ఆహ్వానించుతూ, బ్లుమ్ శాంతి గ్యారంటీ చేయబడింది గాబట్టి యింక చాలాకాలంవరకూ ఎలాంటి భయం లేకుండా నిద్రపోవచ్చునని ఆరోజులలో వ్రాశాడు. ఆ సమయంలోకి సరిగ్గా ఇదే ఉద్దేశ్యాన్ని లేబరుపార్టీ నాయకులలో అనేకమంది వెల్లడించారు. సోషలిస్టు వర్కర్లు తమ నాయకులను నమ్మకుండా సత్యాన్ని పలికిన కమ్యూనిస్టులనే అనుసరించి వుండివున్నట్లయితే శాంతిని కాపాడేందుకు నిజానికి ఎంతో జరిగివుండేది.

ఈనాడు బ్లుమ్, మోచ్, బెవిన్, అట్లీలు యుద్ధాన్ని రాకుండా చేదామను కుంటున్నారంటే నమ్మేదెవరు? వారు గతంలో చేసిన తప్పుడు వ్యవహారాలను మరచి వారిప్పుడు చెపుతున్న మాటలను అంగీకరించేవారు మాత్రమే నమ్మగలరు. కాని అలాంటి అమాయకుల సంఖ్య క్రమ క్రమంగా తగ్గిపోతుంది. ఎందువల్లనంటే జర్మన్ మిలటరీతత్వాన్ని పునరుద్ధరించ డానికీ, బ్రిటన్, ఫ్రాన్సు యింకా ఇతర పశ్చిమ యూరప్ దేశాలనూ సోవియట్ యూనియన్‌కూ, నూతన ప్రజాతంత్ర రాజ్యాలకూ వ్యతిరేకంగా ఒకే యుద్ధ కేంద్రంగామార్చడానికి అమెరికాచేస్తున్న కుట్రలకు యీ పెద్దమనుష్యులు బానిస బుద్ధితో చేస్తున్న సహాయాన్ని అందరూ గుర్తించకపోవడం అసంభవం.

అంతేకాక తమదేశాల్లోని లక్షలాది యువకులను యుద్ధంలో ఆహుతి కావ డానికి తయారుచేస్తున్నారు. అమెరికా శాసనసభలోని సామ్రాజ్యవాద ప్రతినిధీ, సోవియట్ వ్యతిరేకప్లానుల దిట్టా అయిన కానన్ స్పష్టంగా యిలా చెప్పాడు: ఈసారి రాబోయే యుద్ధంలో క్రిందటి సారిలాగా అమెరికా తన సైనికులను యూరప్‌కు పంపించే అవసరంలేదు. అమెరికా చేయవలసిందంతా యితర దేశాల సైనికులకు తర్ఫీదునిచ్చి అమెరికా యువకులకు బదులుగా వారినే మరణ భూమికి పంపించడం జరుగుతుంది.

ప్రపంచాధిపత్యానికి అమెరికా సామ్రాజ్యవాదం తయారవుతున్న మారణ యుద్ధంలోకి తమ ప్రజలను సమిధల్లాగా వినియోగించేందుకు బ్రిటన్ ఫ్రాన్సులలోని కొంతమంది బూటకపు సోషలిస్టు మంత్రులు వాగ్దానంచేశారనడంలో ఎలాంటి సందేహంలేదు. కాని యీ దేశాలలోని యువకులు అమెరికా దేవత ముందు సాధుగొర్రెల్లా బలికావడానికి మాత్రం సంసిద్ధంగాలేరు.

యుద్ధప్రేరేపకులంతా ఏదోఒక బూటకపు ముసుగో లేక బూటకపు శాంతి (పెసిఫిజం) ముసుగునోధరించుతున్నారు. ఇదేపనిని మితవాద సోషలిస్టులు చేస్తున్నారు. మేము సోవియట్ యూనియన్‌కు వ్యతిరేకంగా యుద్ధాన్ని కోరుతున్నామా? రామరామ!! అదెంత మాత్రం నిజంకాదని చెప్పుకొంటారు. "సోవియట్ యూనియన్‌కూ, అమెరికాకూ మధ్యవర్తులుగా" పనిచేయ డానికి మాత్రమే కోరుతున్నామని చెప్పు కొంటారు. గేమోల్లెట్ యిలా చెప్పుతూనే అదే నాలుకతో సోవియట్ యూనియన్‌కు వ్యతిరేకంగా పోరాడాలని పిలుపునిస్తాడు. లేబరుపార్టీ నాయకులు తమకుమట్టుకుతాము అమెరికన్ లతోబాటు మిత్రరాజ్యసమితి వెలుపలా లోపలాకూడా, ప్రపంచ సహకారంచేసే సోవియట్ ప్రతిపాదనలన్నింటినీ వ్యతిరేకించుతారు. అదేసమయంలో తమ నూతన ఎన్నికల కార్యక్రమంలో కమ్యూనిస్టు ప్రపంచానికి, కమ్యూనిస్టేతర ప్రపంచానికి మధ్య శాంతియుత సహకారం వుండటం వలన లభించే గొప్ప అవకాశాలనుగురించి చెప్పుతూ సోవియట్ యూనియన్‌తో సహకారంకోసం ఎల్లప్పుడూ ప్రయత్నించుతామని వాగ్దానాలు చేస్తారు.

ఇటువంటి రెండు నాలుకలతో చేసే బూటక ప్రచారం బ్రిటిష్ కార్మికవర్గంలో లేబరు నాయకుల పలుకుబడిని క్షీణింప జేస్తున్నది. వీరి సోవియట్ వ్యతిరేక దురాక్రమణ పాలసీ యెడల అసంతృప్తి

బ్రిటిష్ కార్మికులలో నానాటికి వృద్ధి అవుతోంది. దీని అర్థం బ్రిటన్‌లోకూడా యుద్ధాన్ని ఆపడానికి నిజమైన విశాల సంయుక్త సంఘటనలో కార్మికులను ఐక్యం చేయడానికి తగిన అవకాశాలు చేకూరుతున్నాయన్న మాట.

అలాకాకుండా మరోవిధంగా జరగడానికి అవకాశమేలేదు. సోవియట్ యూనియనుకూ, నూతన ప్రజాతంత్ర రాజ్యాలకూ వ్యతిరేకంగా సామ్రాజ్యవాదులు సాగించడానికి సిద్ధపడుతున్న యుద్ధ ప్రయత్నాలలో బ్రిటిష్ కార్మికవర్గానికి ఎలాంటిఆసక్తిలేనిమాట వాస్తవం. అంతేకాక అలాంటి యుద్ధమే సంభవిస్తే అది 'బ్రిటిషు కార్మికవర్గ ప్రధాన ప్రయోజనాలకు ఒక గొడ్డలిపెట్టు'.

కేపిటలిస్టు దేశాలలోని నేటి పరిస్థితి ఎలావున్నదంటే అభివృద్ధి నిరోధకవర్గానికి వ్యతిరేకంగా కార్మికవర్గం సాగించే పోరాటంలో కొన్ని ముఖ్య సమస్యలపై ఎక్కువగా కేంద్రీకరించుతోంది. ఈ పోరాటం ముఖ్యంగా తిండీ, స్వాతంత్ర్యం, ప్రజాతంత్రాలకొరకూ, విదేశ దురాక్రమణదారులనుండి జాతీయ స్వాతంత్ర్య రక్షణకోసం మరొక సామ్రాజ్యవాద యుద్ధాన్ని అరికట్టడంకోసం జరుపబడుతోంది. ప్రజానీకం కార్మికవర్గ ప్రధాన సమస్యలను యిదివరకటికంటే నేడు స్పష్టంగా చూడగలుగుతున్నారు. కమ్యూనిస్టుపార్టీ నినాదాలను శ్రామిక జనసామాన్యమంతా సులభంగా అర్థంచేసుకోగలుగుతున్నారు.

కార్మికవర్గశక్తులను తమ ప్రధాన ఆశయముకోసం సులభంగా ఐక్యం చేయడానికి యిదొక ముఖ్యమైన అవకాశం. కాని యీ మహత్తరమైన ఆశయం నెరవేరడానికి ముందు అనేక కష్టాలున్నాయనే విషయాన్ని ఎవరూ గమనించకుండా వుండలేరు. కార్మికవర్గ వర్గశత్రువులూ, వారి ఏజెంట్లు శ్రామికుల ఐక్యతను భగ్నపరచడానికి ఎలాంటి నీచపుకార్యానికైనా సిద్ధపడతారు. కాని యీ మన కర్తవ్యాన్ని కమ్యూనిస్టు ఉద్యమం, మార్క్సిజం-లెనినిజంయొక్క శాస్త్రీయ సిద్ధాంతం యిచ్చిన చక్కని అనుభవాన్ని ఆధారం చేసుకొని సాధించగలం. బూర్జువాదేశాలలోని కమ్యూనిస్టుపార్టీలకు కార్మికవర్గంలోని అత్యధిక సంఖ్యాకులు తమ స్వానుభవంనుండే లెనినిస్టు పద్ధతిలో సంయుక్తపోరాటాలు అవసరాన్ని గ్రహించేటట్లు చేయడానికి గల పరిస్థితులూ, అవకాశాలూ - అన్నీ ఉన్నాయి. దానినంతటినీ, ఓపికతో శ్రమపడి సోషలిస్టుపార్టీలలోని సభ్యులకూ ట్రేడ్‌యూనియన్ సభ్యులకూ వివరించితే చిత్తశుద్ధిగల కార్మికులంతా చివరకు తమ విద్రోహకర నాయకులను తప్పనిసరిగా ఎదురు తిరుగుతారు.

కమ్యూనిస్టులు ఆవిధమైన కృషి జరిపితే నిస్సందేహంగా అంతర్జాతీయ కార్మికవర్గంలో దృఢమైనఐక్యతను జయప్రదంగా నిర్మించడం సాధ్యమవుతుంది. ఈవిధమైన ఐక్యత ఎలాంటి ఆటంబాంబుకంటేకూడా తప్పనిసరిగా శక్తివంతమైనదిగా వుండి తీరుతుంది.

(ఫర్ ఏ లాస్టింగ్‌పీస్,
ఫర్ ఏ పీపుల్సు డెమోక్రసీ
15-5-1949)



# సందేశం

★

ఆంధ్ర అభ్యుదయ వారపత్రిక

సంపాదకుడు:

పి. గోపాలరావు

34, ఆచారప్పన్ వీధి, మద్రాసు 1

| | |
|---|---|
| సంవత్సర చందా | 11-0-0 |
| అర్ధ సం॥ చందా | 5 -8-0 |
| మూడు మాసాలకు | 3 -0-0 |
| విడికాపీ | 0 -4-0 |

(మూడు మాసాలకు తక్కువచందా అంగీకరించబడదు.)

'సందేశం' మొదటి సంచిక మాకార్యాలయానికి చేరింది. ఇందులో తెలుసుకో దగ్గ సంగతులు, సుభాషితాలు, విస్సన్న చెప్పిందేవేదం, దేశ సమాచారాలు గోర్కీ వ్రాసిన ఒక చిన్నకథ, రెండు ప్రపంచాలు, బొడ్డాతిముచ్చట్లు, ఆర్థిక విషయాలు, ఆహారం, ప్రజాభిప్రాయం, గాలిదుమారం, సినిమా, కార్మికప్రపంచం, యువలోకం, జగత్పరిణామం, మాటపా వగైరా శీర్షికలున్నాయి. పత్రికలోని విషయాలన్నీ చాలా విజ్ఞానప్రదంగా ఉన్నాయి. బూతు (సెక్స్) పత్రికలూ, అపభ్రంశ పత్రికలూ విరివిగా వస్తూఉన్న ఈ రోజుల్లో ఇలాంటి అభ్యుదయ పత్రిక యొక్క అవసరం ఎంతైనాఉంది. ఆంధ్ర ప్రజానీకం ఈపత్రికను హృదయపూర్వకంగా ఆదరిస్తుంది అనడంలో ఎట్టి సందేహంలేదు. పత్రిక రూపురేఖలుకూడా ఆకర్షణీయంగా ఉన్నాయి. వ్యంగ్యచిత్రాలు వాటిశోభను మరింత హెచ్చించాయి. ఆంధ్రపత్రికా జగత్తులో ఈ పత్రిక త్వరలోనే సమున్నత స్థానాన్ని ఆక్రమిస్తుందని ఆశిస్తున్నాం.

*

# స్వీకారం

★

శిథిలాలయం: బూట్స్

రచయిత:

ముప్పన చినఅంకయ్య (చినాన్న)

వెల 1—0—0

కళాకేళీ ప్రచురణాలయం

సామర్లకోట

Edited, Printed & Published by
G. Venkateswara Rao Kottapet, Guntur, Printed at Kavitilaka Press, Vijayawada



**మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPL A1 34 M(L) 0 |
| పుస్తకం పేరు | జనత 0 |
| తారీఖు | 31/10/24 |
| ముందు అట్ట | Yes |
| వెనుక అట్ట | Yes |
| మొత్తం పేజీలు | 85 |
| పెద్ద సైజు పేజీలు | |
| ఖాళీ పేజీలు | CI, BCI |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Navya |
| పేజీలు విడదీసినది | Bhanu |
| స్కాన్ చేసినది | Mohitha |
| పరీక్ష చేసినది | RUKSANA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | |

Good